శ్రీ

# సుభద్రాపరిణయము.

ఇది

కూచిమంచి జగ్గకవి ప్రణీతము.

కలావతీపత్రికయందు ప్రకటితము.

మొదటికూర్పు 200

కలావతీముద్రాక్షరశాలను ముద్రితము.

రాజమహేంద్రవరము.

వెల. 8 అణాలు.



1904

శ్రీ

# సుభద్రాపరిణయము

## ప్రథమాశ్వాసము.

---

శా. శ్రీయలరన్ సుభద్రయును సీరియుఁ బార్శ్వముల న్మెలంగఁగన్
త్యాయతలీల నీలశుభధరాగ్రమునందు వసించి నిచ్చలుం
బాయక భక్తకోటి కనపాయశుభంబు లొసంగు శ్రీజగ
న్నాయకదేవదేవుఁ డభినంద్యకృపామతి మమ్ముఁ బ్రోవుతన్.

చ. జలజదళాక్షు వక్షమను సౌధతలంబునఁ గౌస్తుభాతిని
ర్మలనవదీప దీప్తులు విరాజిలఁ గాపురముండి ముజ్జగం
బులుఁ గరుణాకటాక్షమునఁ బ్రోచు జగజ్జనయిత్రి లక్ష్మి ని
చ్చలు నమదీయ గేహమున సంతసమూని వసించుఁ గావుతన్. ౨

చ. అగజవివాహవేళఁ దన యౌదలఁ బొల్చు సుధాంశు మండలం
బెగదిగఁ జూచి పెండ్లికొడు కేమిటికిం దలఁ బ్రాలపళ్లెమి
మ్ముగ ధరియించె నంచు నతిముగ్ధతఁ బల్కు భవాని నెచ్చెలిం
దగఁ గని నవ్వు శంకరుఁ డుదారత మాకు నభీష్టమీవుతన్. ౩

చ. కరిముఖుఁ గన్నతల్లి శశిఖండవిమండను కూర్మిరాణి భూ
ధరవరు ముద్దుపట్టి నిజదాసగృహాంగణకల్పవల్లి ని
ర్జరనికరప్రపూజిత విరాజితచారుపదారవింద శాం
కరి భువనైకమాత కుతుకంబున మాకు శుభంబు లీవుతన్. ౪

శా. వందారుత్రిదశాధిపప్రముఖ దేవవ్రాతసన్మౌళిస్ఫుర
న్మందారద్రుమదివ్య సౌరభమిళన్మంజు ప్రసూనాగ్రని
ష్యందన్నవ్యమరంద బిందుపరిషిక్తాంఘ్రిద్వయుం డాశ్రితా
నందుం డెప్పుడు మాకు నిచ్చు నతులానందాయురారోగ్యముల్. ౫

క. తెలిలావుపులుఁగు మావులు, గలయాలవేలుపుల పెద్ద గాదిలి కలికిం
బలుకుల చిలుకల కొలికిం, దలఁతున్ సాహిత్యమిడఁ దరలని భక్తిన్. ౬

# సుభద్రాపరిణయము

చ. ధనదసుహృన్నగాగ్రస ముదంచితదివ్యకపాలమాలికల్
గనుఁగొని గాఢయుగ్మములుగా మదినెంచి కరంబు సాచి తా
గ్గనసవిగారనంబలఁచి కౌతుకలీలనటించుపార్వతీ
తనయుఁడు విఘ్నరాజు ప్రమదంబున మత్కృతిఁ బ్రోచుఁగావుతన్ ౭

గీ. వామలూరుభవుని వ్యాసు మల్హణుఁ గాళి దాసు మాఘుఁ జోరు దండిఁ బ్రవర
సేను భట్టబాణు శ్రీహర్షు భవభూతి భారవి మయూరుఁ బ్రస్తుతింతు. ౮

గీ. నన్నపార్యునిఁ దిక్కయజ్వాచిరాజు సోము నమరేశు శ్రీనాథు భీమకవిని
రంగనాథునిఁ బోతనకుఁ బ్రాజ్ఞవరుని శంభుదాసు భాస్కరు సంస్మరింతు. ౯

సీ. కౌండిన్యగోత్రవిఖ్యాతునిఁ గూచిమంచ్యన్వయాంభోధి నీహారకరుని
గంగనమంత్రి శేఖరునకు నంగనామణియగు లచ్చమాంబకును సుతుని
బహుకావ్యనిర్మాణ బంధురప్రతిభునిఁ గుక్కుటేశ్వర కృపాంకూరలబ్ధ
సత్కవితా మహాసామ్రాజ్య భారధౌరేయుని బుధజనప్రియ చరితుని
దెందులూరి లింగనారాధ్య దేశికేంద్ర, దత్త మాహేశ్వరాచార వృత్తి రతునిఁ
గందరాడ ఘనగ్రామమందిరుని మదగ్రజునిఁ దిమ్మకవిరాజు నభినుతింతు. ౧౦

వ. అని యిష్టదేవతాప్రార్థనంబును, మహాకవివర్ణనంబునుం గావించి. యేనొక్క
మహాప్రబంధంబు రచియింపంబూని యున్న సమయంబున. ౧౧

సీ. బ్రహ్మహత్యాఖిలపాపజీమూత ఝంఝూవాతమే వేల్పు సౌధచక్ర
ముసురాపానోగ్ర దురితాంధకారార్క కిరణమే దేవుని కేతనంబు
గురుతల్పగమనాఘ ఘోర కుప్యాటవీ దవవహ్ని యే ప్రభుదర్శనంబు
కనకాపహరణ దుష్కలుష పర్వత మహాశని యే విభుని సుప్రసాదకణము
కలితతత్సహవాసాది వృజినకలభ, పంచముఖడింభ మే స్వామి పాదతీర్థ
మట్టి పురుషోత్తమోత్తమ పట్టణాధి, నాయకుండైన శ్రీజగన్నాయకుండు. ౧౨

క. ఒకనాఁడు నాకుఁ గలలోఁ, బ్రకటకృపాస్వాంతుఁడగుచుఁ బ్రత్యక్షుండై
నికటమున నిల్చి మెల్లన, యకుటిలగతి నిట్టులనుచు నానతియిచ్చెన్ ౧౩

గీ. వత్స వినుమీవు నా పేరివాఁడ వగుట,
నీ సుభద్రంబు లిడ వచ్చి నిలచినాఁడ
పాపఁగని మాపు సౌఖ్యంబు లొసఁగువాఁడ
నిందు వేడుకమదిఁ బూనియుండినాఁను. ౧౪

క. వెలవ్రెప్పార సుభద్రా, పరిణయ మొనరించి మాకు భక్తి దలిర్పం
జెలువుగఁ గృతిగాఁ గింపుము, సరసయశస్సాంద్ర జగ్గసత్కవిచంద్రా. ౧౫

వ. అని యానతిచ్చి యప్పరమేశ్వరుండంతర్హితుండైన నేనత్యంత సంతుష్టాం
తరంగుండనై. ౧౬

షష్ఠ్యంతములు.

క. భద్రిగజ రత్నమునకు సు, భద్రావదనాంబుజాత భాస్కరునకు ని
ర్నిద్రప్రభావునకు బల, భద్రసమేతునకు విహగపతికేతనునకున్. ౧౭

క. ఇంద్రద్యుమ్న సరస్తట, సాంద్రవిహారానుమోద సదమలమతికిన్
చంద్రార్క నయనునకు ని, స్తంద్రకృపాసింధునకును జనబంధునకున్. ౧౮

క. నిరవద్య పతితపావన, బిరుదాంకునకున్ సమస్తబృందారకకిం
నరగరుడ యక్షఫణిక్షే, చరవిద్యాధరకదంబ సంసేవ్యునకున్. ౧౯

క. హరిహయముఖనిఖిలామర, వరమకుట విఘటితదివ్యవనరుహరాగో
త్కరరుచి నీరాజితమృదు, చరణసరోజునకు భానుసమతేజునకున్. ౨౦

క. శక్రోపలనిభగాత్రున, కక్రూరజనావన క్రియాసూత్రునకున్
నక్రాపహరణ కారణ, చక్రాయుధ సహితపాణిశతపత్రునకున్. ౨౧

క. శతధృతినత చరణునకున్, దితిసుతకుల హరణునకు సుధీరక్షణవి
శ్రుతకరుణాభరణునకున్, నతజనశరణునకు నీలనగశరణునకున్. ౨౨

వ. సమర్పణంబుగా నారచియింపంబూనిన సుభద్రాపరిణయంబను శృంగార రస
ప్రబంధంబునకుం గథావిధానం బెట్టిదనిన. ౨౩

క. శ్రీకరమై మునిలోకవ, శీకరమై జగదతీతచిరతరబహుపు
ణ్యాకరమై నైమిశమను, ప్రాకటగహనస్థలంబు పరఁగు ధరిత్రిన్. ౨౪

క. ఘనులవ్వని శౌనకముఖ, మునివరులత్యంత మోదమునఁ బుణ్యకథల్
వినుచుండి రోమహర్షణ, తనయునిగని యనిరి వినయతత్పరులగుచున్. ౨౫

గీ. మునివరేణ్యా నరుఁడు మును సుభద్రాసతీ, మణిని బెండ్లియైన మహితచరిత
దెలుపవలయు మాకు దృఢమతి నననాతఁ, డెలమి వారికిట్లు దెలుపఁదొడఁగె. ౨౬

మ. ఇలయున్ సర్వపురాధిరాజములలో విఖ్యాతమై యొక్కప్రోల్
బలభిద్రత్న వినూత్నకాంచనకనత్ప్రాసాదకేళీకళా
కలనాకౌశల కామినీముకురశంకాకారిరాకానిశో
త్పలినీబాంధవ మండలంబవని నింద్రప్రస్థనామంబునన్. ౨౭

క. ఆపురమరువై భవజిత, గోపురము మణీనిబద్ధగోపురమిలకున్
నూపురము కలిమిచేడియ, కాపురమున్నట్టి నెలవు గణుతియొనర్పన్. ౨౮

మ. తావరా తాలకతానిమేడల నుదింగోరంబుగా నాడురా
నవలామిన్నలు మిన్నగేళ్కులిలో నాళీకనాళచ్ఛటల్
తివురొప్పారఁగఁగోసి మేపుదురుహాళింగేళి వ్యాసాళికిన్
భువనాతీత విచిత్రవైభవములం బొల్పారు నవ్వీఁడునన్. ౨౯

చ. మొలకపసిండి జీనిపనిముత్తెపు మేడలయందు బోఁడ్లై
కులుకుచు నాత్మనాయకులఁగూడి శ్రమంపడియున్న పిన్నరా
చెలువల గుబ్బచన్గవల జిప్పిలుచెమ్మటలార్చుచున్ స్వధునీ
జలజసుగంధగంధిలవిశంకట మందరగంధవాహముల్ 3౦

ఉ. మెఱుఁగుకడాగి బంగరపు మేడలరేల్విహరించు చేడియల్
బిఱబిఱఁ జెంతనున్న శశిబింబముగాంచి నిజాస్యలక్ష్మిని
త్రతిహరింపఁ బాకొనిన తస్కరుఁడంచును ముష్టిఘట్టనల్
మటిమటి జేయఁ జందురునకు మచ్చఘటిల్లెను నాఁటినుండియున్. 3౧

సీ. మదగజంబులు సానుమద్ద్రవ్యజంబులుగాఁగ విమలాశ్వములు తరంగములుగాఁగ
జనపరంపర జలజంతుసంతతిగాఁగ లలనలు విద్రుమలతలుగాఁగ
సౌవర్ణసౌధముల్ సైకతంబులుగాఁగ దేవతాభవనముల్ ద్వీపములుగ
తూర్యనాదములు నిస్తులఘోషములుగాఁగ నీలభిత్తికలు శైవాలములుగ
హీరసోపానపంక్తులహీనఫేన, పుంజములుగాఁగఁద్రిభువనాద్భుత సమగ్ర
వైభవంబున ననయంబు వరలువార్ధి, రాసిచందంబుపూని యారాజధాని. 3౨

ఉ. హాటక దివ్యరత్నఘటితావృతమై దివిలోఁజరాయు బ
లోత్కటవెడఁద క్రొత్తడపుకొమ్మల నిమ్ములఁ గ్రమింత్రు మి
న్నేటితరంగ మాలికలనీఁదుచు గ్రీడలు సేయు ఖేచరీ
పాటలగంధులారుచిర పట్టణరాజమునందజస్రమున్. 33

సీ. అంభోధిశయను బాహాంతరంబును బోలె ప్రతిదినకమలాధివాసమగుచు
ననురావతీపట్టణాధిరాజముఁబోలెననిమిషసంచారహారియగుచు
వనజహరియుతమ్ముఖీ స్వర్గభాగమునుబోలె సు[illegible]విభ్రాజమానమగుచు
విపులదానవిహార నృపసభాస్థలిఁబోలె కవిరాజ సద్వచఃకాంతమగుచు
భూరిదిగ్మండలముఁబోలె పుండరీక, కుముద[illegible]భాసమానమై కమలభవుని
సదనమునుబోలెఁ బరమహంసవ్రజాభి, రామ[illegible]పోలి ఖేయాంబురాశిదనరు

శా. జంభారాతికరాగ్రజాగ్రదురువజ్రక్రూర[illegible]ధారాహతిన్
స్తంభీభూతములైన భూమిధరముల్ స[illegible]నిషచే

సంభాషణము వేఁడి వజ్రిసుధ భూషావాప్తి నత్యుజ్జ్వల
తుంగ్రభీంద్రావృతులగు తత్పుర వరాంగుంగోల్వఁ బోలుం జుమీ. ౩౫

క. ఆయ్యారే పురివర్ణము, లాయ్యారంబెనయ ఖురపుటోద్ధపరాగం
బయ్యెను ఘోటకములపై, కయ్యానకు కాలుమవ్వ కరణిం జల్లున్. ౩౬

గీ. సభలఁ దవరాశిపోర్విదస్త్రై సంచరించి, తనకు బాగడిక దచ్చెఁగా కెవసి చూడ
జలజసంభవుఁ డేపాటి చదువుకాఁడ, టంచుఁ దెగడుదు రప్పురి యగ్రభవులు. ౩౭

క. సర్వజ్ఞశిఖామణులరి, గర్వవిదూరులు తమోవిఖండనులు కళా
ధూర్వహులనసు నమ్హాన్యు, లుర్వీజనులలర రాజులాప్పురిన్. ౩౮

గీ. ధనము బుధులకు నిడి పేరుగనినవేము
ధనదులము గాక యొకనూ లఁదవధనంబు
ద్రాఁచుకొనెడు కుబేరుఁడే ధనదుఁడంచుఁ
గేరుదురు మాటికవ్వీఁటి యూరుభవులు. ౩౯

మ. హాలమే పొద్దు భుజాగ్రపీఠమున గాయల్ గాయఁగా మోఁచియుఁ
త్కలికంద్రిమ్మరుగాని కానిపాలముందాదున్న పండింత్రునే
మొలకుం దెల్లని బట్టగానమయిసీముప్పొద్దుగల్ ద్రావునా
హాలియంచున్నరసింతు రందు నయభాగ్యాకర్షకుల్ కర్షకుల్. ౪౦

గీ. కనుల రాగాధరల్లు నీలకచలు హీర
రదలు నూత్నక నఖరలు రమ్యవిద్రు
మాంఘ్రులు సువర్ణ విగ్రహాలు చటివార
సతులు మణిమయ కాంచన ప్రతిమలౌర. ౪౧

సీ. తమనెమ్మొగముల చెల్వము గను నివియను సరణిఁ గమ్మని తమ్మివిరులొసంగి
తమవాలుఁజూపులందము పూనునియను కరణిఁ జక్కని నల్లగల్వలొసఁగి
తమవాతెఱల సొంపు దాల్చు నివియనుజాడ నాడెంపు దాసనములొసఁగి
తమదంతపంక్తి చందము జెందు నివియనుపోలుపున గుందకుట్మలము లొసఁగి
తమనఖర నాభి నాసాపదముల కొమరు
గాంచు నివియను క్రియ గేతకములు పొన్న
పువ్వులు చంపకములును జెందొవలు నొసఁగి
విటులు నలరింతురి పుష్పలావికలు వీఁట. ౪౨

సీ. తమ మొగంబులు సరోజములంచు జేరి నాసలు చంపకములంచు మజరగు తేంట్లు
తమ కెంపు బెదవులు బింబములంచు జేరి మైసాంకవంబున కుల్కుచను శుకములక్క

దనుకోమలతలు నాగమోలంబు మఱికేరి కన్బోనులు విందగని పాంథగానులు గతులఁ
దనుకరధబాబు పల్లవములంబు మఱి కేరికొప్పులు మొగుళ్లని యోసనిలుపికములఁ
గాంచి కిలకిల నవ్వు మఱిగనక కంక
గారవంబులు చాలఁగ బిట్టాచిరా పులుఁగు
చెంత్రములఁ బోలుదురు పాంథచిత్తములు చ
లింపనా బ్రోడశాలిపాలికలు లీల. ౪౩

క. జ్ఞానగరరవేలు మేలుగ, మానితకీర్తి ప్రతాపమహిమోన్నతుఁడై
దీనజనావనరతుఁడై, దానకళామహితుఁడనఁ దగు ధర్మజాదేవుండ్. ౪౪

సీ. సర్వసర్వంసహా ధూర్వహతా దృతకరికిరి మహిగిరి కచ్ఛపుండు
బహుకులాచల శిలాఫలకాగ్రభాగవినిహిత జయ శాసనాంకుండు
తతనిరంతరదాన ధారాప్రవాహనిశ్ప్రపూరిత సప్తసాగరుండు
చండఖండన సముద్దండవిక్రమ కళాఖండితాహిత రాజమండలుండు
జైత్రయాత్రావసర వినిస్తంద్రరణిద
ఖండ భేరీ ధణంధణత్కారఘోర
వీరకాహళ కారావ విచలితాష్ట
మహిధేంద్రుండు పాండవేయాగ్రజుండు. ౪౫

సీ. కువలయానకళాకుశలుఁ డింతియకాని వివరింపఁ గ్రవిశ్వేషిగాఁడు
సతతసన్మార్గ సంచారి యింతియకాని రూపింప దోషాకరుండుగాఁడు
బుధజనప్రియాకరాభ్యుదయుఁ డింతియకాని శోధింపగురుని పత్నుండుగాఁడు
వర్ణితపరిశుద్ధ వర్ణుఁడింతియకాని గణుతింపఁ పులిపలత్మఁఁడుగాఁడు
ధర్మిరయీతఁడు రాజుగాకిల నొకండు
రాజకుటకట్టు దగునని రహినిసుకవి
రాజులును రాజులును బుధరాజులెన్న
రాజశేఖరుకీర్తి నాధర్మరాజు దనరు. ౪౬

సీ. చెవిచేంతగూర్రదిద్వి జిహ్వాకోట్లులగూర్చి బిహ్మాహింసనబుద్ధి ప్రబలఁ డేని
దుర్వర్ణాశాభూమి భృత్యాటంబులనుగూడి యుగ్రుఁడై ప్రజఁద్రుంపకుండెనేని
పరమువాహినిగూడి పౌరుషంబరవాడి తిప్పలబడి తూలి తిరుగఁ డేని
విసముగుత్తుఁబట్టివేడి చూపాదవంగ ధర్మశాలిగ్రా తనరఁడేని
యక్షవునకు రాజశేఖరుఁడనెడు పేరు
దగుఁగదయటంచుఁ గవిబుధోత్తములు పారెఁ

దనమహారాజ శేఖరత్వము గణింపఁ
దనరెఁ జిరభోగి సురరాజు ధర్మరాజు. ౪౭

గీ. ప్రాణికోటుల దండించు జాలి యెఱుఁగఁ
డెప్పుడు మారకులగు బంట్ల నేలఁబోఁడు
గురు గదాన్వితుఁడై మూలఁగుంటుపడఁడు
నిర్మలాచార శీలుఁడౌ ధర్మరాజు. ౪౮

గీ. అనుపమానవ్రాళికభీమవిజయ
నకులసహదేవులనఁగ విఖ్యాత బలాఢ్యు
లఖిల బుధబంధురక్షణోపాయవిదులు
నలువు రనుజన్ములు ప్రశాంతనయులు గలరు. ౪౯

క. అనలోపలబ్ధములు దనయావతి దప్పక సమస్తహారిదంత ధరి
త్రీనాథ సమితి గెలిచి యహీనపదార్థములు దెచ్చి యియ్యఁగ నెమ్మిన్. ౫౦

సీ. హారప్రభాపూర హీరసోపానంబు నీలజాలక జాలలాలితంబు
వైడూర్యవిరచిత వలభికానికరంబు విద్రుమస్తంభ ప్రవిస్తరంబు
ఘనపుష్యరాగ ద్వారబంధంబు గోమేధికావృత కుట్టిమంబు
విపులగారుత్మత వేదికారుచిరంబు పద్మరాగకవాట బంధురంబు
స్వచ్ఛముక్తాఫల చ్ఛటాచ్ఛాదనంబు
నగుచు వెలుఁగు సభాగృహాభ్యంతరమున
సకలబుధబాంధవామాత్యసహితుఁడగుచుఁ
గడఁక నాకనాథుఁడు పేరోలగమున నుండి. ౫౧

గీ. తనపురోహితుఁడైన ధౌమ్యమునియునుంగు
ననుజకామరుని సకలవిద్యావిశార
దుని విశారదు వీక్షించి యనుపమాన
మృదుమధుర వాక్సుధాధార లొలుకఁ బలికె. ౫౨

క. ధరణీసురద్వారకపురి, కరిగి జనార్దనుని గాంచి యందఱి సేమం
బరసి నిరాతంకగతిన్, సరగున రమ్మనుచు నెలవొసంగిన యంతన్. ౫౩

మ. చనియా భూమిబుధుండు గాంచె నమరన్ సంప్రీతచేతస్కుఁడై
ఘనగంభీర జలాంతరాళచలదుగ్రగ్రాహనక్రోగ్రమున్
ఘనటఝ్ఝారి ఝుళంఝుళారవవలత్కల్లోలనిద్రమున్
జనహృద్యాస్పద దక్షముద్రము సరిత్సంయోగ సచ్ఛిద్రమున్. ౫౪

సీ. ఘనులకపార జీవనమొసంగెడుదాత మర్యాదప్పని మానఘనుఁడు
బహుతరకవిరాజ పాలనశీలుండు సతతమహోన్నత చక్రవర్తి
యురుమహీభృత్కోటికునికి పట్టగుమేఁటి మణికంకణోర్మికామానితుండు
వర్ధమానానంత వాహినీ సహితుండు భువనాభిరామవిస్ఫురిత కీర్తి
యారసాధీశ్వరుండాత్మ నెన్నబాడ
బాశ్రయుండగు టేమి చోద్యంబటంచు
నెంచుచు ధరామరోత్తముండేగి భవ్య
సరణినల్లన ద్వారకాపురము చేరి. ౧౧

సీ. వలపుగొజ్జఁగినీటి సెలయేటిగమి దాటి ఘనసారకదళికా వనులుగడచి
చలువచెంగలువ బావులక్రేవ విహరించి దాకఁపందిరిచాల్పుదరులనిలిచి
బలితంపునెత్తమ్మి కొలఁకుల కడ డాసి పొవలుక్రొవ్విరి మల్లెపొదలుదరిసి
గుజ్జుమామిడి మ్రాఁకులనీడవసియించి గున్నసంపెఁగతోఁట గుంపులారసి
పారిజాతమహా పాదపచ్ఛటాని
రంతరోద్యాన వాటికాభ్యంతరేందు
కాంతమణిపీఠికాగ్రభాగముల మెలఁగి
ద్వారకాపుర ఘంటాపథమునఁ జనుచు. ౧౨

సీ. కనకనిర్మిత శతాంగములు నిరీక్షించి యలమేరుశిఖరంబులని తలంచు
మత్తద్విరదరాజ మండలంబులు చూచి యంజనాహార్యంబులనుచు నెంచు
జంద్రకాంతోపల సౌధముల్ గనుగొని హారగిరికూటంబులని గణించు
బహుళసమున్నత ప్రాకారములుగాంచి ఘనచక్రవాళాద్రులనుచు నెన్ను
దివ్యమాణిక్య దీప్తి దేదీప్యమాన
దేవతాగార గోపురాదికములరసి
రోహణక్ష్మాధరములని యూహసేయు
పరివిమలానంద హృదయుఁడై బ్రాహ్మణుండు. ౧౩

గీ. అట్లుపురవీధిజని మురహరునినగరు
చొచ్చి మోసల నిల్చియచ్చోఁ నొక్క
చారునీక్షించితనరాక శౌరికెఱుఁగఁ
జెప్పుమని పంపనతండేగు నప్పుడవల. ౧౪

సీ. బహురత్నదీప ప్రభాభాసమానంబు కనకపంజర శారికా శుకంబు
పటుతరరతిబంధ బంధుర ప్రతిమంబు గోమేధికోజ్జ్వలత్కుట్టిమంబు
ధళధళత్కాంతి నిర్మలతరాదర్శంబు కస్తూరికాగంధ గంధిలంబు
ఘనపేటికాపేటి కాళాలరమ్యంబు హిమవారిపూరిత హేమకలశ
మతులసౌరభ్య సంవాసితాభ్రపాళి
జాతభూజాతకుసుమ సంఘాతరచిత
పారిశృంగార మహితశయ్యాతలంబు
నగుమ సొగసీను కేళీగృహాంతరమున. ౫౯

చ. జిగిబిగిపట్టుపట్టెనుసుజీనితలాడయు పక్కదిండ్లు సొం
పగు విరిపాన్పు పూసురటి యాకు మడుంగులొసంగు చుంగడుల్
సొగసులు గుల్కుకుంద నపునాత్రిపు బొమ్మలు గాల లీలమే
ల్పగడపుగోళ్లదోమ తెరబంగరు మంచముమీఁద సుకన్. ౬౦

సీ. కనకకంకణఝుణత్కారంబు వెలయంగ భోజకన్యక పదాంబుజములొత్త
నిద్దంపుతెలిమించు టద్దంబుకైబూని నెలిచి సాత్రాజితి నీడచూపఁ
జరణమంజీర నిస్వనములు చెలఁగ జాంబవతి మాణిక్యచామరము వీవ
కెడఁగు క్రొందెలియాకు మడుపులు గొని మిత్రవింద సువర్ణపురంపు విడెమొసంగ
లీలభద్రసుదంత కాళిందిలక్ష
ణయును మొదలగు వరపద్మనయనలూఁడి
గములు గావింప సుఖగోష్ఠిఁ గాలుచుండెఁ
బృథుయశఃస్ఫూర్తి గోపాల కృష్ణమూర్తి.

గీ. అపుడుచారుఁడు హరిచెంతకరిగి మ్రొక్కి
దేవ పాండవులనుపభూదేవుఁ డొకఁడు
వచ్చి మిముదర్శనము సేయ నిచ్చగోరి
యోర్మి దనరార మొగసాల నున్నవాఁడు. ౬౧

క. అనివిన్నవించుటయున
వ్వనజదళేక్షణుఁడు శయ్యవెళ ముడిగి స
య్యనభూసుర వరుచెంతకు
జని వినయంబెనయ మ్రొక్కి సరసత మీఱన్. ౬౨

ఉ. ఆమహినిర్జరాన్వయ సుధార్ణవపూర్ణ విభావరీచరుణ్
ప్రేమ మెలపన్ దోడుకొని పెంపలరం దన దివ్యకేళికా

ధామముసొచ్చియచ్చట నితాంతహరిన్మణి భద్రపీఠికం
దామరసాయ తాక్షుఁడు ముదంబున నిల్పి సపర్యలిచ్చుచున్.

కం. విప్రవర పాండుసుతు లిం
ద్రప్రస్థపురంబునందుఁ బ్రాభవలీలన్
సుప్రీతినున్న వారలె
క్షిప్రంబునమాకుఁదెలియ జెప్పఁగవలయున్. ౬౫

ఉ. సేమమె ప్రాఙ్నగాస్తనగ సేతు హిమాచల మధ్యభాగ భా
గ్భూమితలేంద్ర మస్తకవిభూషణ దివ్యసరోజరాగ ర
త్నామల దీప్తిదీపిత పదాంబురుహాభిగతాభియాతికిన్
సామజఘోటకప్రముఖ సాంద్రవిభూతికి ధర్మసూతికిన్. ౬౬

కం. సామజ హయరథభటము, ఖ్యామిత చతురంగబల సమన్వితరిపురా
డ్భీమునకున్ భీమునకున్, సేమంబుగదయ్య విప్రశేఖర చెపుమా. ౬౭

కం. దుర్జనరి పురాద్భయదమ
హార్జిత విక్రముఁడు నృపజనోత్తముఁడు నయో
పార్జిత విమలయశుండ
య్యర్జునునకుఁ గుశలమే ధరామరవర్యా. ౬౮

కం. కులకుధరసదృశ ధృతిభా, క్కులకు మహాశిరకిరణకుల జలధిశశాం
కులకుఁ బ్రతాపాంకుశాలకున,కులసహదేవులకు మిగుల గుశలంబుగదా.

క, కాంతాజనరత్నముల, శాంతిమహాధర్మమతులు జనమతచరితల్
కుంతీద్రుపదతనూజలు, సంతసమున నున్న వారెజగతీదివిజా.

గీ. నావుడు విశారదుఁడుపల్కె నలిననయన
తావకీనకటాక్ష వీక్షావిశేష
మహిమనచ్చోటవారు సేమముననుండి
మిమ్మునరయంగ నిటకుఁబంపించినారు. ౭౦

క. నీవనితలకును నీకున్, రేవతికిని హరికి రోహిణికి దేవకికిం
బావనగుణుఁడగు వసు, దేవునకున్ భావుకంబె ప్రాదశేంపిసతా. ౭౧

గీ. నారదాది మౌనినాయకుల్ గనలేని
నిన్నుఁజూడఁగంటి నేఁడు సకల
పాపములునశించె భాగ్యరేఖలభించె
సంతసించె మదియునంతరూప. ౭౨

క. నీమహిమ మెన్నదరమె పి, తామహసుత్రామశైల తనయాధిపము
ఖ్యామరవరులకు నైనం, దామరస దళాయతాక్ష దనుజవిపక్షా. 43

వ. అని మఱియు నిట్లని వినుతింపం దొడంగె.

రగడ. జయరమాకుచకుంభ కుంకుమ సాంకవాంకిత నిజభుజాంతర
భయదవక్రనిరుద్ధయూథపపాలనాతి కృపానిరంతర
నందగోపకుమార సనకసనందనాది మునీంద్రపూజిత
మందరోద్ధర లోకకారణమాన నిత్యయశోవిరాజిత
భోజకన్యా విమలహృదయాంభోజ మత్తమిళిందనాయక
రాజమాన మహాతపోధన రాజశశ్వదభీష్టదాయక
రాధికామధురాధరామృత రసఝరీపరిపాన కౌశల
సాధుసజ్జన సముదయావనసార కరుణాపూర పేశల
భానుకోటి విభావిభాసిత భవ్యకౌస్తుభమణి విభూషణ
ధేనుకాసుర దర్పహరణ సుధీజనప్రియ మృదులభాషణ
సతత వితతపి చండమండిత సరసిజాతభవాండమండల
అతులపంకజరాగమణిమయహారినూతన మకరకుండల
మకరకేతనదర్పణ ప్రతిమానమానిత మృదుకపోలక
వికటశకట ఖరాదికాసుర వీరఘోరస్మయ విభాళక
వల్లవీపరిరంభ సంభ్రమవర్ధమానసమగ్ర కౌతుక
మల్లయుద్ధ కళావిజృంభణ మథితచాణూరాది ఘాతుక
లోకనాయక సత్యభామాలోల నీలాహృదయరంజన
భీకరాహవరంగ రంగత్పృథుబలాన్విత రిపువిభంజన
నిరుపమాన విహారనవనవనీత చౌర్యకళావిశారద
హారిహయాశ్మవిభానిభాకలితాంగ రుగ్జిత నీలనీరద
మదనకోటివిలాస భాసుర మాలినీమృదు హృదయతస్కర
త్రిదశపరివృఢవిభవ జాంబవతీసతీవదనాబ్జ భాస్కర
కాళియాహి ఫణోపరిస్థల కల్పితానములాస్యఖేలన
నీలపరిధానప్రియానుసత్యసజ్జన భక్తపాలన
దేవదేవమహేశ కేశవ దేవకీ వసుదేవనందన
పావనాంగవిలిప్త దివ్యజవాదికా మృగనాభిచందన
దివ్యపరిమళ మిళితయమునాతీరనీపవన సంచారణ

తొలిమల తుదయందు నలినబంధుఁడువోలె ముదలమణిమకుటంబు చెలువుమీఱ
రత్నవేదికయందు రంగవల్లులువోలె నవమౌక్తికయుక్తచేరులమ్మె నెఱస
కటకకంకణముద్రికాకనకకుండ
లాద్యలంకారములు తద్దేహరుచులు చూప
సత్యభామాది పట్టంపు సతులఁగూడి
యొఱపు రాణింప శుభలీల నున్నవాని. ౧౨

సీ. తెలిదమ్మిరేకులఁ దెగడుకన్నులవానిఁ దొగరెందునగు ముద్దుమొగమువాని
మించుటద్దము మించుమెఱుఁగుఁ జెక్కులవాని కొదమతేఁటుల గెబ్బుకురులవాని
చిగురుటాకులఁబోలు చేయిదమ్ములవాని గురుకవాటము గేరు నురమువాని
గజతుండములనెన్ను భుజదండములవాని బింబోపమానాధరంబువాని
నవ్యచంపకముకుళా నాసవాని భ
కంబుసీకాశరుచిరగళంబువాని
హరిహయశిలాకలాప దేహంబువాని
భావజవిలాసు శ్రీకృష్ణదేవుఁగంటి. ౧౩

వ. అట్లుగనుంగొని సముచితపరికారంబున.

గీ. ఎలమి నతనికి మీసేమ మెఱుఁగఁ జెప్పి
యతనిసేమంబు చిత్తముగ నరసి దివ్య
వసనమణిభూషణాదుల నబ్జనాభు
చేతఁ గొనివచ్చినాఁడ మీచెంతకిపుడు. ౧౪

క. ఓ ఱేఁడ వినుము నెయ్యము, మీ యంగనయ్యాదుర్విభుండు మీ సేమము వే
మాఱు వెదఁదగ నడుగుచుఁ, జేకొండు తలంపులేకవిని యుండఁడొగా. ౧౫

గీ. అనిన నుత్సహించి యానృపాలాగ్రణి
యతనిఁ గారవించి యనుచుటయు ర
యంబయద్ద్వారపురాగ్రి గన్యఁదనదు
సదనమునకు సంతసమునఁ జనియె. ౧౬

వ. అని శౌనకాది మహాఋషులకు రోమహర్షణి యెఱింగించిన వారలతని సచ్చరిత
థావిధానం బెల్లని యడుగుటయును.

మ. యమునాతీరనికుంజసంజననిత్యానందకృష్ణాధికా
రమణీపీనపయోధరద్వయపరీరంభ ప్రసక్తాశకుం

ఘనపాటీర మృగీమదోల్లసిత వక్షోభాగ దాక్షాయణీ
రమణాంభోజ భవామరేంద్రవినుత ప్రాజ్య ప్రభావోదయా.

క. అరిపృతనాసమవర్తీ, సురసముదయ చక్రవర్తి సుగుణస్ఫూర్తీ
శరదంబుదనిభకీర్తీ, పరిహృతభువనార్తీ పతితపావన మూర్తీ. ౨౨

మాలిని. సజలజలద నీలా శాతకుంభోరుచేలా
త్రిజగదవనశీలా దీనమందారసాలా
కుజనకుల విభాళా గోపికాకేళిలోలా
వృజిన హరణమూలా వేణుగానైక లీలా. ౨౩

గద్య. ఇది శ్రీమజ్జగన్నాయక దేవదివ్యకృపా నిరీక్షణాసంలబ్ధ సారకవితావిచిత్ర
కౌండిన్య సగోత్రపవిత్ర కూచిమంచిగంగనామాత్యపుత్ర సకలవిద్వజ్జనవి
ధేయ జగన్నాథ నామధేయ ప్రణీతంబైన సుభద్రాపరిణయంబను శృం
గార రసప్రబంధంబునందుఁ బ్రథమాశ్వాసము.

శ్రీ

# సుభద్రాపరిణయము

## ద్వితీయాశ్వాసము.

శ్రీమత్పురుషోత్తమపుర, ధామ సమిద్ధీమదనుజదర్పవిరామా
ధీమజ్జననుత సగుణో, ద్దామ జగన్నాథ నామదైవలలామా. ౧

వ. అవధరింపుము శౌనకాదిమహర్షులకు రోమహర్షణియిట్లని చెప్పందొడంగె
వట్లు విశారదుండగు ధర్మరాజుచేతననుజ్ఞాతుండై తనగృహంబునకరిగి మునునాఁడు
సవ్యసాచికడకుం జని మంతనంబున నతనితో నిట్లనియె. ౨

గీ. పార్థ ధర్మజుండు పనుప ద్వారకకేగి
భూరితేజుఁడైన శౌరిఁగాంచి
వారి సేమమెల్ల నారసి పిదపమీ
సేమమెల్ల నెఱుఁగఁజెప్పుటయును. ౩

వ. అమ్మహాప్రభుండమందానందకందళిత హృదయారవిందుండైయనేకధనకనకమ
ణివిభూషణాంబరాదికంబులు నాకొసంగి పుత్తెంచిన వచ్చి ధర్మరాజున కాకుశ
లవృత్తాంతం బెఱింగించితి నింకనొక్క విశేషం బెఱింగించెద నాకర్ణింపుము. ౪

క. ఆకృష్ణప్రభుసోదరి, రాకాహిమకరాభిరామాననభూ
లోకాతీతగుణాన్విత, ప్రాకటరుచి నలరుఁగద సుభద్ర యనంగన్. ౫

క. రాజకులతిలక వినుమా, రాజముఖీమణినిఁ బొగడ రాదింతయునా
రాజీవభవులకైనను, రాజీవభవునకునైన రాజసలీలన్. ౬

సీ. చిలుకలకొల్కి ముద్దులగుమ్మ వన్నెలగని యపరంజిబంగరుసలాక
తలిరుజొంపపుమావి వలిగప్పురపు దిమ్మ కలువమిటారిరంగుల కొటారు
వలపుగస్తురి లప్పతోలు కరికొమ్మిగ్గించు కమ్మగొజ్జెఁగ బంతి తమ్మికొలను
తళుకువజ్రపుబొమ్మ తెలిముత్తెపుగోవ పగడపుదీవ సోయగపువాఁక
కడిఁది వెన్నెలనిగ్గు చెంగలువబావి
చికిలిక్రొమ్మెఱుంగుటద్దంబు పికిలిచెండు
నాగసరలరాయ నెమ్మొల్లలనాగబాగు
పొగడసలవిరి వేనోళ్ళఁ బ్రోడకైన. ౭

ఉ. దాని ఘనాఘనద్యుతి వితానస దృక్కచభీమరీచికిన్
దానిధళస్త శత్త్రసుతాతి తతాభినుత ప్రభాళికిన్
దానిథగద్ధగద్రుచిని తాంతవిరాజకపోలపాలికిన్
మానవనాథ యెట్టిదృఢమానసులైనఁ జలింపకుందురే. ౮
మ. రతిరాజోజ్వల మోహనాస్త్రము రమారామా తనూజాతసం
చితలోకాద్భుత జీవనౌషధము రాజీవాంశుగారామసం
స్థితదివ్యప్రసవాభ సౌరభ మిళద్దేవద్రురాజం బహో
శతపత్త్రాయతచారునేత్రఁబొగడన్ శక్యంబె యెవ్వారికిన్. ౯
గీ. సరసిజాతాక్షి కీల్జడ చక్రికైన
నంబుధరవేణి లేగానుహారికైన
ముగుద ముద్దుమొగంబు సోమునకునైన
గణుతియొనరింప శక్యంబు గాదు సుమ్మి. ౧౦
సీ. సకియముద్దుమొగంబు చంద్రబింబమె సుమీ నెరిదృక్చకోరముల్ నిలిచియుండె
తరుణిచన్గుబ్బలు తమ్మిమొగ్గలె సుమీ చూచు భ్రమరముల్ సొంపుమీఱె
వనజాక్షిపాక్కిలి వల్మీకమె సుమీ రోమలతాభోగి యాడెజాగె
బాలికామణివేణి నీలాంబుద మె సుమీ శృంగార రసవృష్టి చిలుకఁబోడఁగె
సహహామనుజేశ యత్తలి నాకుఁబోఁడి
సారసౌందర్య మమరభుజంగయక్ష
గరుడగంధర్వ కిన్నరాంగనలకైన
ఖచరవరవర్ణినులకైనఁ గలదె చెప్పుమ. ౧౧
క. నడమందము సైకపునె, న్నడుమందము తేటిదాటునకు దీటగుకీ
ల్జడచందము తద్దయునె, వ్వడిజిందము దెగడుగళము పరలఁ జెలికిన్. ౧౨
సీ. చంద్రవిస్ఫురణంబు సన్నగిల్లఁగ జేయు నెలతనవ్వును మేను నెమ్మొగంబు
సారంగముల దిరస్కారంబు గావించు మెలతచూపులు నడల్ మెఱుఁగు దురుము
చక్రంబులను భంగసరణి గ్రిందొనరించుఁ బొలఁతిగుబ్బలు కటి పాక్కిలియును
హీరంబుల గరంబునీసడింపగఁజూచు గలికిపల్ చాల్పును గోను నాటు
నవనినాయక యాభువ నాద్భుతాభి
నవవిలాస కళాసమున్నతి దనరుఁ
జెలువనడుగ నిరుపమగ తలలుగలుగు
పలఁతికైనను గణుతింపనలవిగాదు. ౧౩

శా. జౌరాసౌరలరారు కొప్పుచెలికొప్పారంబరోభృత్సునా ఇంద్ర
సీరప్రస్తరశైవల భ్రమరికా శ్రీలన్ విడంబించి మ
జ్జారే సారెవిసార సారసతటిత్సారంగభృంగాంగ భా
నారాచోత్పలకైరవోత్కరము నెన్నంజాలు దృగ్జాలికముల్. [illegible]

గీ. కమలముఖ్యాంతి ముద్దుమొగంబుఁ దొడరి, గెలువఁజాలక రేకెత్తి సకములెల్ల
విమ్ముటయు నీరజంబయి పిచ్చలించి, తరుణియనుగులువట్టుక తరలకుండె. ౧౫

ఉ. చందురునందుకందు జలజాతములందు రజోవికారముం
జెందగ ముద్దొనర్చి సరసీరుహగర్భుఁడు లోఁ గ్రహించి యా
నిందమరల్పఁ గోఁదలచి నేరుపుతో నకలంకమైన యా
సుందరి ముద్దునెమ్మొగము చోద్యముగా సృజియింపఁబోలు జుమీ. ౧౬

సీ. ఉవిదకన్బొమలకు నోడిసింగిణివిండ్లు వడివంగి శరమూని యడలఁజొచ్చె
సకియనాసకునోడి సంపెంగపూమొగ్గ విమ్ముమొగ్గైపోయి గచ్చుదరిగి
చేడెకల్వరుసకు నోడివజ్రపుజాలు పుడమి నదృశ్యమై యడఁగియుండె
యువతి కెమ్మోవికి నోడితామర కెంపు బిట్టుతాల్సింబూని చట్టుపడియె
జలజముఖి పీనులకు నోడి చక్కిలములు, పలుదెరంగుల నడిగన బడఁగనలిఁగె
లోనుపడియుండె నయ్యారె లోకులెరుఁగ, నధిప చెలిసోయగంబెన్న నలవిగాదు.

క. ముకురాభవదనచెక్కులు, మకురంబుల గరము వివలి మాయుగఁ జేయున్
సకియగళము దరములను, త్సుకుతమెముం జెల్లవుచ్చి సడివడిఁ జేయున్. ౧౭

గీ. రతిమనోభవకేలి కారామపూత, లతలు సతబాహువులు కిసలములు పాణు
లసమసాయక కాసారబిసము లతివ, భుజములం భోజములు శయంబులు నృపాల.

క. చెండ్లున్ మేలిమిబంగరు, గిండ్లున్ గజనిమ్మపండ్లు గీర్తింపగబల్
గుండ్లున్ వనితామణిపా, లిండ్లనసరిగాఁ గదమహీవరతిలకా. ౨౦

ఉ. పొక్కిలికల్గునన్ వెడలి పొంకపుకెంజిగురాకుమోవి ను
వ్జక్కెరలప్పెకై సరవి జాగిపథంబున నున్నగుబ్బచ
న్జక్కపదోయిఁగాంచి దనఁజాలకనిల్చిన చీమచాలునా
జక్కెరబొమ్మయారువిల సద్గతిమీరు ధరాపురందరా. ౨౧

ఉ. నిద్దపుజాలువాపసిడి నిగులనెమ్మెయి తమ్మికెంపుల
మ్ముద్దొకారపుందొగరు మోవి మదావళకుంభపాళిఁ చే

పరవశతమిాఅనూరకె పలుకరించు, మదనశిఖాగ్ని దందహ్యమానుఁడగుచు. ౩౫

సీ. కలకంఠశుకశారికలధ్వానకలకులోఁగు కొదమతుమ్మెదచాల్పు రొదకువీఁగు
వలినాలిగాడ్పుబోఁదలసోఁకులకుఁ దూలుఁ జలువచ్ఛంగలువతావులకుసోలుఁ
గలువయుమంగు వెన్నెలకాకలకుఁ బాయువలపు బన్నీటిదాఁ కలకుఁ దారుఁ
దలిరుగమావి మోఁకలకు బెగ్గిలికుందుఁ దెలిగప్పురపు బూదికలకు నెందు
నాతతస్ఫీత బలమునోఁ జాతశాత, చూతజలజాత విశిఖసంఘాతఘాత
యాతనాధూతచేతోంబుజాతుఁడగుచు, భూతలాధీశుఁడిదుమలఁబొరలుచుండు

మ. వడియుం బ్రాసమునుజ్జగించి కపటవ్యాపారమేపార నె
ప్పుడుఁ గీర్వాణపశబ్దముల్ పలుకుచుం భూరిప్రియాలంకృతుల్
సడలం జేసి పదార్థవాంఛయొకపజ్జం లేకదుర్లక్షణం
బడరంగాకవితిత్తనుండె మతిలేకచ్చో సభాధూర్యుఁడై. ౩౮

క. ఇవ్విధమునఁ గవ్వడియాఁ, జవ్వనిపైఁ దలఁపునిలిపి జాలిమొసంగం
బువ్వువిలుకాని బాధలఁ, గ్రొవ్విరిలోలోనఁ గందికుందుచునుండెన్. ౩౯

గీ. అక్కడ సుభద్రయును దమయన్నప్రేమ, నక్కజంబుగ విజయుని చక్కఁదనము
విప్రపుంగవుఁడెఱిగింప వినిమనమున, నాతుభాకారు వరియింప నాసపడెలి. ౪౦

ఉ. ఎన్నఁడు మాతు నేను త్రిదశేంద్రసనూర రమాతుమాంసలం
గిన్నరరాట్కుమారుని ప్రకృష్టమనోహర రూపరేఖచే
బన్నమునొందఁజేయఁదగు భవ్యతరాకృతి వానిసద్దపుం
బున్నమచందమామనగఁ బూనుముఖాబ్జము వానిఁగవ్వడిన్. ౧౪

శా. ఆరాజన్య శిరోవతంస సముసముస్యత్కీర్తి నన్గాఁగిటన్
గారామారఁగఁ గూర్చి పేర్చు నెలమింగంపడ్ కేళీకళా
ధౌరంధర్యము మీఱ నేలుకొన సద్యస్సౌఖ్య లీలాపయః
పారావారమునందుఁ దేలెడు మహాభాగ్యంబు నాకబ్బునే. ౪౨

ఉ. ఆరయనాదు దివ్యమణిహార మహారజతప్రసక్తభూ
షారుచిరాంబరాదులును సారపటీరతుషారనీర కా
శ్మీరమృగీమదాగరులు చిత్రనికేతన వీటికాదులుం
గోరఁగ నేలయా నృపతికుంజరు నెయ్యము గల్గకుండినన్. ౪౩

క. ఎన్నఁడిటు వచ్చునర్జునుఁ, డెన్నఁడు నను పెండ్లియాడు నింపొదవఁగన

న్నెన్నడు కౌఁగిటఁ జేర్చు, నెన్నడు నాకోర్కె దీర వెనవిసుఖింతున్. ౪౪

ఉ. అలలనామనోజ్ఞుఁడు సమాదర లీలలసాగరంబునన్
మేలిమితాళిబొట్టు రహిమీరఁగఁ గట్టిసుపాణిముత్తెపుం
బ్రాలు శిరంబుపై సురుచిరంబుగ నించినయేనిగట్టురా
చూలికినోలిఁ బూజలిడి వ్రాతలొనర్చి కడంకఁ గొల్చెదన్. ౪౫

ఉ. అద్దిర నాకువాని నెనరబ్బకయున్నఁ గడిందిజాలిలో
దద్దవెడందనై పాదవిపక్షక బాణపరంపరాతిచే
నెద్దొసఁగుల్ ఘటిల్లునొ మహీజనులేమనియెందురో కదే
సుద్దులకేమి తమ్మిపువు చూలితలంపెటులున్నదో కదే. ౪౬

ఉ. అప్పిభుచెంతకేగి వినయంబున నాతెఱఁగెల్ల దెల్పిరా
నెవ్వరి వేఁడుకొందు నటులేగియునంగులు విన్నవించినన్
నవ్వులదెట్టియయ్యువని నాయకుఁ డెగ్గుగ నెంచునేమొ కా
దవ్వులవార్త లేదవని తామణులేడ బెడంద లేడికిన్. ౪౭

సీ. ప్రియమాగ్రమలరాఱ బిరబిరనచటికా నేలవేల్పుల పెద్దయేలవచ్చె
వచ్చియచ్చెలువుగా విచ్చలనిడి నాసురేంద్రసూతియొయ్యారంపు మేల తెలిపెఁ
దెలిపిన నలరి యెంతే కూర్మి మెరయ నాహృదయమాతనిమీఁద నేలతవిలెఁ
దవిలిన తెఱఁగు మంతనమున నొరులకు నెరిగింపఁబోవ సిగ్గేలపొడమె
పొడము గాకేమి యష్మేటి పొందునాకు, గలుగుకోరకెట్టి మున్నరికలమెలఁగిన
మెలఁగఁదగుఁగాక యహహాయీ వలపునిలుప, నలవియెయటంచుమరియునన్నలిన
నయన. ౪౮

మ. కలయంగోరుఁగవుంగలింప దివురుం గానీల్లుఁ గన్నీయుఁబె
గ్గిలు గెంగేల్ సునుఁ జెక్కునందిడు దిశల్ గ్రేకంట నీక్షించు వె
ల్వెలఁబోవున్ బయలాలకించుచువగచున్ వేసారుదూపిల్లునోఁ
జలయూఁచుం బలవించు నుస్సురను వంతంగుందు నెంతేనియున్. ౫౦

క. అద్దముగన్గొనినొసలన్, దిద్దుకస్తూరిరేఖ తీనదన్నం బే
కొద్దిగ నేనియుకంటికి, నిద్దురగానదు విడెంబు నెరిగొన దెప్పుడున్. ౫౧

చ. చిలుకలగొట్టునెచ్చెలులు చెంతకువచ్చిన దిట్టునూరకే
కిలకిలనవ్వు నంచలను గించుకరంబునెరువ్వు శారికల్

వలికెన గుండుఁ దుమ్మెదల పాటలకుం దిగులొందు నద్దిరా
చిలుకల కొల్కి యబ్బురపు చిత్తవికారము లెన్న జిత్రముల్. ౫౩

సీ. కలఁగు మత్తమయూర కలహంస కాకేర కలకంఠ కంఠ హుంకారములకు
మలఁగు నానాసూన మకరందరసపాన ధావన్మధువ్రత రావములకుఁ
గలఁకుఁ జందనశైల తటసమాగత బాలమందగంధానిలాస్పందములకు
నులుకు శీతమయూఖ విలసితకిరణౌఘ సాంద్రచంద్రాతపాసారములకు
తలఁగు నుద్దండ పటుగజ దంష్ట్ర నిహిత, చండపుండ్రేక్షు కోదండ దండ గళిత,
రతిమనోహర ఘోర నారాచములకు, మిగుల మదినోడి యమ్ముద్దు చిగురుబోఁడి. ౫౪

క. అటులర్జునుఁడు సుభద్రయుఁ, బటుతర మోహాంధకార పరవశతమెయిం
గటకటఁబడుచుండిరి హా, త్పటుముల్లను ద్వాహకాంక్ష పొరిఁబొరి బెరయన్.

ఉ. అంతట నొక్కనాఁ డొక ధరామరవత్సుని గోవుఁ దస్కరుల్
సంతసమొప్పఁ గొనిచయ్యన నేగిన నాతఁ డెంతయున్
వంతగలంగి శీఘ్రమున వక్త్రము నుమ్మడి మోఁదుకొంచు న
క్కుంతిసుమారు మేడకడఁ గుయ్యిడినన్ విసితస్త్రరంబునన్. ౫౫

గీ. మేడదిగ్గనుఱికి క్రీడివిప్రునిఁ దాసి, యతనిమాట లెల్ల నాలకించి
వెరపుమాన్చి పాండవేయాగ్రజుని మేడ, కేగి విల్లునమ్ము లెలమిఁ గొనియె. ౫౬

మ. కొనియాచోరులఁ ద్రుంచి బ్రాహ్మణునకున్ గోవున్ సమర్పించి గొ
బ్బున నేతెంచి కృతాంతసూతికి నతుల్ పొల్పొంగ గావించి తా
మును నెయ్యంబున జేసికొన్న నియమంబుం దెల్పి యొక్కొండు దా
బనిమీఁదన్ ధరణీప్రదక్షిణ మొనర్పం బోవఁ బ్రార్థించినన్. ౫౭

క. ధర్మజుఁ డర్జును గనుగొని, నిర్మల మతిఁ బలికె నిట్టి నియమంబులు ద
ష్కరులకుఁ గాకసదములు, ధర్మవిచారులకు నేల తత్త్వజ్ఞనిధీ. ౫౮

గీ. కోప్రదక్షిణంబు సుప్రీతిఁ జేసిన, గోప్రదక్షిణంబగుం గదయ్య
యట్లు సేయుమనిన నతఁడు విన్నం బోయి పలికె మృదుల మధుర భాషణముల. ౫౯

గీ. అన్న ధర్మరాజ మున్ను తీర్థాచర, ణంబు సేయ బుద్ధి నాకుఁ గలదు
కార్యకారణములు గడు నేకమయ్యె నిర్ణ తనితనకుఁ దాని దైవగతిని. ౬౦

క. కావున తీర్థాచరణము, గావించి రయంబవత్తుఁ గ్రన్నన సెలవి
మ్మా వలదని పలుకకయని, పే వేల విధముల మ్రొక్కి వేఁడినన తఁడున్. ౬౧

గీ. సమ్మదమునొందియప్పుడు విశారదమందు, మొదలుగాఁగలవిప్రోత్తములను బరిజ
నములఁ గొందఱిదోడిడి సముచితప్ర, కారమునఁ బల్కి దీవించి కౌఁగిలించి. ౬౨

క. పొమ్మని యానతియొసఁగిన, నమ్మనుజాధీశమణికి నభివాదనముల్
గ్రమ్మఱ నొనరిచి బంధుజ, నమ్ములచే నాజ్ఞఁ గొని మనంబలరారన్. ౬౩

క. కుంతికిని భీమసేనున, కెంతయు సద్భక్తి మ్రొక్కి యెలమిఁ గవలకున్
సంతసమొదవఁగఁ బలికి ని, జాంతఃపురి వెడలె బరిజనాన్వితుఁడగుచున్. ౬౪

గీ. అవ్విధంబున ధర్మరాజానుమతిని, దగిన హితబంధువైదికోత్తములతోడఁ
గూడుకొని కిరీటి గడితంపు వేడుకలర, భూప్రదక్షిణ మొనరించు బుద్ధి నరిగి. ౬౫

చ. సురుచిరలీలఁ గన్గొనియె శోభనదివ్యసరోజమాలికా
పరిమళలాభలోభ మదబంభరడింభరవానుషంగము
భక్షరదురితౌఘభంగనటిభాస్వర గాఢతరంగరంగదీ
శ్వరమకుటాగ్రరంగభుజసంగను గంగఁ దగంగఁ జెంగటన్. ౬౬

క. కనుగొని హర్షాద్భుతములఁ, మనమునఁ బెనఁగొనఁగ నికటమహిఁ జాగిలి వం
దనము లొనరించి మృదుకర, వనజంబులు మౌళిఁ జేర్చి వడి నుతియించెన్. ౬౭

క. అంగజహరమకుటాంతర, రంగావిమలాంతరంగ రంగత్తుంగా
భంగతరంగా వృజిన, క్రాంగానతి సేతు నన్ను నరయుము గంగా. ౬౮

గీ. అవ్వ నిన్నుఁ దప్ప దప్పులఁ బాపఁగన్న, ముక్తి కల్గునటయ మోఘభంగి
నీటమునుఁగు ఫలము నే నెఱుంగను సుమీ, దివ్యతరతరంగ దివిజగంగ. ౬౯

క. జ్వాలాభీలానలయుత, హాలాహలమారగించి హరుఁ డటు సోకన్
నీ లలితామృతలేశము, మౌళిపయిం జిలికి యతని మనిచితివి గదా ౭౦

శా. నీతీరద్రుమకోటరాంతర చరన్నీడోద్భవ శ్రేణులున్
నీతోయాశ్రితమత్స్య కచ్ఛపములు న్నించున్ నిజేజేంద్ర సం
ఘాతారోకితఘంటికాఘణఘణత్కారాతి భీతాహిత
వ్రాతాంభోజముఖీ జనస్తుతమహా రాజన్యకం బెన్న నతీ. ౭౧

శా. నీనీరంబులఁ దోఁగుమానవుఁడు నిర్నిద్రప్రభావంబునన్
నానాకల్పకకోటిమేటి దివిషన్నారీజనోపేతుఁడై
యానందప్రదరత్నకీలితవిమానారూఢుఁడై స్వర్గభో
గానూనస్థితి నుల్లసిల్లుఁ గద గంగామంగళాంగీ మణీ ౭౨

క. అని కొనియాడుచు నన్నరి, మునుకలు గావించి దానములను బ్రతతిం
దనియించి తత్తటంబున, ఘనతర మానమున జపము గావించె నెడన్. ౬౩

గీ. సరగ నవ్వటి కులూచి నారఁ బరగు నొక్క, యురగ కన్యక నెమ్మది నరుగుదెంచి
నరుఁగ నుంగొని తన్మనోహర విలాస, విభ్రమములకుఁ గడు మనోవీథియందు. ౬౪

ఉ. అబ్బుర మొంది చంద్రుఁడో జయంతుఁడో కంతుఁడో యవ్వసంతుఁడో
లిబ్బుల రాజపాపఁ భక్తియితఁ డారయఁ గాకయున్న నీ
నిబ్బరపుంజగా సొగసు నెక్కొన నేర్చునె వీని యొమ్మునన్
గుబ్బలు గ్రుచ్చి హెచ్చరికఁ గ్రమ్ముల తాంగిదె భాగ్యమెన్నఁగన్. ౬౫

చ. తొగరు మెఱుంగువాతెఱయుఁ దోరపు క్రొవ్విరి దమ్మిరేకులన్
నగఁదగు కన్నుఁదోయి పులినంబుల గేరు పిఱుందునందమున్
సొగసులు గుల్కు పెన్నెరులు చొక్కపు ముద్దుమొగంబు గల్గు నీ
జగము గనింగ నుంగొనినచానవిరాళిఁ గలంగకుండునే. ౬౬

ఉ. చక్కెర వింటివంటవెనె కెసక్కెములాడు గదయ్య వీని మై
చక్కదనంబు నెన్నడుము సొంపు గలంచుగ దయ్య సింగము
న్నక్కల పెక్కుతీరు పడఁ జేయుగదయ్య మెఱుంగుటద్దము
న్నక్కవ వీని కౌగిటఁ బెనంగెడు భాగ్యము నాకు గల్గునే. ౬౭

గీ. వీని మోవితేనె లానిచెక్కుల ముద్దు, గొని మిటారి గబ్బి గుబ్బ గవను
రమ్ము గ్రుమ్మి నెమ్మి కమ్మవిల్తుని కేళి, నెనయకున్న వయసి దేలనాకు. ౬౮

క. అనిమిగుల మున్నరికెకొనా, తనినెత్తుక నేగబరచి తన కేళిగృహం
బున నునిచిన నవ్విజయుఁడు, గను విచ్చి కడెంది మీఱఁ గనియుల్లమునన్. ౬౯

సీ. నవనవకిసలయోన్నతరసాలము వోయి మినుకు బంగరు మేడ మెరయు టేమి
యుత్తుంగమణిసైకతాగ్రభాగము వోయి చలువక్రొన్ననపాన్పు మలయుటేమి
నిస్తంద్రకల్లోలనికరంబులును వోయి రేరాచరా మెట్లు గూరుటేమి
పరిఫుల్లజలజాత పరిమళంబులు వోయి కమ్మకస్తురితావి గ్రమ్ముటేమి
యారనే మున్న సురసరిత్తీరభూమి, నున్న యిది లేదో కలగంటినో మఱేమి
మాయయో రాక యిదియంచు మరలిచూచు, నవసరంబున నదిదియొయార మెనయ.

చ. తెలుపు పసిండిబొమ్మయొ సుధాకరరేఖయొ మించుదీవయో
చిలుక పఠాడి తేజి పొరచేతిని గారపు నిల్వుటద్దమో

వెలఁగనరాని చూనికము వెన్నెలతేటయొ నాఁదనచ్చురే
గులుకు మిటారి నొక్క మదకుంజరగామినిఁ గాంచెఁ జెంగటన్. ౮౧

గీ. కాంతి దానిమనోహరాకారరేఖ, కద్దుతింబది యార యియ్యంగనాల,
లామమారుని సామ్రాజ్యలక్ష్మియనఁగ, బరఁగుచున్నది కన్నులపండువగుచు. ౮౨

ఉ. చూడమె చెప్పఁగావినమె శోభనకాంతి యుతాంగులైన యీ
రేఁడుజగంబులందుఁ గలయింపునిభాస్యలవారలెల్లని
చేడియమేలుబంతి కెనసేయనొకింతయుఁ బోలనేరరే
వేడుకయయ్యెబో మదికి వేమరు నీమదిరాక్షిఁ జూచినన్. ౮౩

ఉ. కన్నులచెన్నునెమ్మొయినిగారము చెక్కులపెక్కు మోముగో
మన్నులికొనుబాను మొగమందము వేఁలి బాగుగుల్కులే
జన్నులనీటుముత్తరుల సౌరు వడంద పిఱుందుచందము
న్నన్నకడిందినై మదికి నత్యసమోదము గూర్చెనియ్యెడన్. ౮౪

క. అనికొనియాడుచు నెంతయుఁ, గనుపట్టునొయారికలువ గంటింగనియ
య్యనిమిషరాజతనూభవుఁ, డెనలేని మనోనురాగ మెనయఁగఁ బలికెన్. ౮౫

ఉ. ఎక్కడిదానవీవు హరిణేక్షణ యీజగమెద్ది నీవు న
న్నిక్కడికేల తెచ్చితివి దేమిటియోజ పృథప్రవర్తస్తుతై
దిక్కుల వెంబడింజను విదేశుల నిట్లొనరింప బాడియే
యక్కటబేలనై యురక యూరడిజెంపట మేలె చెప్పవే. ౮౬

గీ. అనిన నప్పొపరాఁ జవరాలు రాచ, మిన్నదిన్నని నిడుసోగ కన్నుఁదోయి
దేలఁ గన్గొని యోసుదతీ మనోజ, నినుము వాచందమంతయు విన్నవింతు. ౮౭

గీ. ఈజగంబుర సాతలంబనుటూచి, యనుభుజంగము రాజకన్యకను నీవి
లాసగరిమంబు గాంచి యుల్లాసమొదవ, నిన్ను వరియింపఁగోరి బల్మనిన్నరికల.

క. ఇటఁ దెచ్చినదానవిశం, కటకరుణాలోకనమునఁ గన్గొనినను నె
క్కటి వలరాచ దురంబున, బటుగతినలరించి ప్రోవు ప్రమదం బెసఁగన్. ౮౮

గీ. అనుఁడునుడు రాజముఖి కిట్టులనియెఁ గ్రీడి, భూతలంబేడ భుజగేంద్ర భువనమేడ
తరుణులెచ్చట మరియన్య పురుషులెచట, నహహ యీదుండగం బేల యుహింపజాల.

క. మోహావేశంబున నెడ, రూహింపఁగఁ బరునిఁ గోరు టుచితమె నీకి
ట్లాహా మేలెంతటి, సాహసురాలవె భుజంగసారసనయనా. ౯౦

గీ. కాముకుఁడుగాక వ్రతమూని భూమిదిరుగ, సేమమునఁబోవునన్నిట కేమిపనికిఁ
బ్రేమమునఁ దెచ్చితిది మేర యేమనోజ్ఞ, సోమబింబోపమానాభి రామవదన. ౯౧

గీ. నయమున విధిజ్ఞులై యెట్టి నరసత్తములకు, పరవధూమణి నెనయంగఁ బాడియగునె
బేలయీరీతి కోర్కెనీకేలయనిన, భావమునఁ గలంగి యప్పొల్తి పాఁపపాప. ౯౨

చ. కనుఁగవ నశ్రుబిందువులు గ్రమ్మఁగ గద్గదకంఠయై మొగం
బునఁ గళ దప్ప విన్నబాటొదవ ముప్పిరిగొన్న వలవంతఁ బల్కె నో
జనవరచంద్రయో నయవిశారదయో జనరంజనైక శో
భనపరరూపయో ఘనకృపాయుత యీసతి విడంగఁ జెల్లునే. ౯౩

గీ. కన్నియను నన్ను నేరోఁపు గాదు నీకు, జన్నియిడియుంటి నాయుల జివ్వనంబు
ప్రాణరక్షకు మిగుల ముఖ్యంబుగలదె, నీవెఱుంగవె సత్కృపానిధివధీశ. ౯౪

సీ. మానవాధీశ యింకఁ జెక్కు మాటలేల, ఘోరమారకిరాత దుర్వారవిశిఖ
శిఖిశిఖాయాత నలచేఁ గృశింపనీక, నీకవుంగిటఁ బొదవి మన్నించుమిప్పుడు. ౯౫

గీ. అనిరుద్ధిలోఁ గరంగి యమ్మనుజవిభుఁడు, దానికెంగేలు పట్టి పూపాన్పుపైనఁ
దార్చి స్మరశాస్త్రనియతి విస్తరిలమదన, కేలికా సౌఖ్యజలరాశి నోలలార్చె.

క. అంతట నమ్మహికాంతుఁడు, కాంతాలోకైకమాళి కార్త్స్న్యమున
త్యంతముదంబునఁ గన్గొని, యింతింతన రానికూర్మి నిట్లని పలికెన్. ౯౭

గీ. రమ్య ఫణిరాజనుల కరిరాజయాన, యిచట నింక జాగొనరించ నపటుతైథి
కావనీసురలాత్మ నేమని తలంతురొ, పోయివచ్చెద నెలవిమ్ము పాలుపుమీఱ. ౯౮

ఉ. నావుడు విన్నబాటొదవ నాగకులాంబుజహేళివల్కె నో
భావజరూపయో పరమపావనయో రసికాగ్రగణ్య నీ
బోవఁగ వద్దటంచు మదిఁ బొంగెదు కూర్మిలోద నాడినన్
దేవర చిత్తవృత్తి యొకతీరుగ నుండును నేమి సేయుదున్. ౯౯

క. ఎన్నఁడు చూతునో నిను నా, కన్నుల కరవెల్లదీరఁ గ్రమ్మరనిఁక నా
పన్నజనావన గుణసం, పన్నా ధీమత్ప్రసన్న ప్రభుజనమాన్యా. ౧౦౦

శా. నీచెల్వంబును నీవిలాసమును నీనిర్నిద్రతేజంబు నీ
వాచాప్రౌఢిమ నీకృపాగుణము నీవైదుష్యసామగ్రియున్
నీచంచన్నయనాబ్జవీక్షణము నీనిత్యప్రసన్నత్వమున్
నాచిత్తంబునఁ బాయజాలదుగదా నాకేలతంతాయుధా. ౧౦౧

క. నీకును నాకును నేస్తం, బేకరణిం గూడెనేల యెడఁబాయఁగనే
లా కట్టిడి దయ్యంబిక, యాకలుపెక్కులవిబుధ వర్ణితశీలా. ౧౦౨

ఉ. పల్లడిగొన్న ప్రేమమున మన్మథరాజ్యసుఖైకలీలలం
బ్బెల్లుగ నిన్నుఁ గూడుకొని పెక్కుదినంబులు వేడ్కనుంటి నే

నెల్లెడలందు నిన్నె స్మరియింపుచు నుండఁ దలంపుఁ జేసి నీ
యుల్లమునందుఁ జాలదయ యుంచుము రాజమృగీమనోభవా. ౧౦౩

గీ. అనిపలికి కల్కి మేల్బంతి యతలినపుడె, మురలజాహ్నవికడఁ జేచిన మాడిఁ బెనంచు
కూర్మి నక్కన్నెఁ బోదవి కన్గొనలబాష్ప, కణములురలంగఁ దనదులోకమునకేగె. ౧౦౩

గీ. అంతఁ దైర్ఘికాకహిత భూసురాదిజనులు, నృప[illegible]కమ కథనుత్సహింపుచుండి
రప్పుడు విశారదుని జూచి యజ్ఞానుండు, పలికెనిట్లని యతిమృదు[illegible]ముల.

సీ. వింటెవిశారద వింతయొకటి నేను బాహ్నవీతటమున సంధ్యవార్చి
జపమొనర్చుచునున్న సమయంబునందు నులూచియున్నన్నగలోలనయన
యొక్కతె వచ్చి నన్మక్కువదనోడ్కొని చనితనకేలికా సౌధమునను
నిలిపితద్దవయు మంచెలమితో బహువిధంబులఁ బ్రా[illegible]నమాచేసెమ్రొక్కుటయును
మగువదీనత కొంతయు మదిగరంగి, దానికోరికసఫలంబుగా నొనర్చి
సమ్మతిలఁ బల్కి క్రమ్మఱ సరగనిచటు, కరుగుదెంచితి చెప్పుది యతిశేఖర ౧౦౫

క. ఆచిల్వ చెల్వ చెల్వము, వాచస్పతికైన భోగి వరునకునైనన్
బ్రాచుర్యగతిని నుతింపన, గోచరమగు నితరజనులకుం దరమగునే ౧౦౬

చ. తళుకుపసిండిబొమ్మ నెరతావుల గొజ్జఁగిపూవు గొమ్మ క
న్నులవిలుకాని తూపు జిగిసూల్కొను కౌను మెఱుంగు కోపు ప
న్నెలవడుచక్కెతేట వెలనిచ్చిన బల్పిరతనంపు మూటయే
అలనలు దానితోఁ దుదత దుఃఖా వితలాతల భూతలంబులన్. ౧౦౭

ఉ. ఆపెను గబ్బుకొప్పు నాగసాపువు చెండులఁ జెండుగుబ్బల
ద్దాపసమించుమించు తెగసాగి జయించు మిటారిచూపుతో
షాపుదమిందమింబరమునట్టి పిరుందు పసందయారె యో
వూపనిగారపుఁ బ వయసుపోటుల చోటుల నెన్న నున్నవే॥ ౧౦౮

సీ. పెనుగప్పు నునుగొప్పు ననుగుప్పు విరితావు లరిజాలముల నామెతలఁ బెంచు
మగమీలఁ దెగజాల నగువాలుజూపులు చలదురుచూపుతై జనుల గాడ
బలుగుబ్బలుల గిబ్బువలిగుబ్బ చనుదోయి సొబగుచూపఱ మదిమారఁ గొనక
పగడాల జగడాలు దగ్గనేలుజిగిమోవి యువజనంబులకు నోరూరఁ జేయు
సారసానంగమదఘన సారగంధ, సారసీహారనీర కాశ్మీరభూరి
సౌరభంబులు దిశల హెచ్చరిక బవక, నురగకులబాల నామోహిల నాకప్రసరతు.

గీ. శ్లేయునేటికి వినుదాని సోయగంబు, దానిఁబుట్టించినట్టి విధాతకైనఁ
బొగడరాదన్యులకునెట్లు పొగడవచ్చు, బెత్తుజానిపైడిబొమ్మయా చిలుపకొమ్మ. ౧౧౦

గీ. అనిన వరుఁడు సంతసంబంది యతని, వెక్కుడుఁగులఁ గీలించి తెక్కిరీటి
యనుచరబలంబుతోఁ గూడి యచటఁ దరలి, చనియె నెమ్మి నీహారశైలమునకు. ౧౧౧

సీ. పటుజలోద్ధతఘోర పంచాస్యశార్దూల మాణదారణకుంభ మౌక్తికంబు
తతగుహాంతర నిరంతర చరద్వృకదోగ్ర శాఖామృగనికరంబు సంకులంబు
నిబిడపాటీరద్రుమ నిష్కుహాంతరలగ్న ఫణిఫణామణిఘృణి భ్రాజితంబు
ఘనఝరీనినదాభ్ర గర్జాభ్రమితమత్త ప్రమదనృత్యన్మత్త బర్హిణంబు
సరస సంగీత విద్యాప్రసంగరంగ, మాణగంధర్వ యక్షగీర్వాణఖచర
సుందరీబృంద పరివృత కందరంబు, పుణ్యగణ్యంబు నీహారభూధరంబు. ౧౧౨

గీ. అన్నగంబెక్కి యచటి చోద్యంబులెల్లఁ, గనుఁగొనుచుఁ గొంతకాలమచ్చటను మెలఁగి
కదలి యుత్తరదంతి కాగస్త్యవటము, హిరణ్మయము గాంచి చనె భృగుశృంగమునకు

గీ. అచ్చట హిరణ్యబిందు తీర్థావగాహ, నంబు గావించి విహితదానములొనర్చి
చనియెఁ బరిజన తైర్థిక సహితుఁడగుచుఁ, బుణ్యకరమైన నైమిశారణ్యమునకు. ౧౧౪

క. ఆరూఢభక్తి నచ్చట, నారాయణుఁ బూజచేసి హరిపుణ్యకథా
సారామృతపానుండై, యారాకొమరుండు చనెఁ బ్రయాగంబునకున్. ౧౧౫

క. సంగాతులు దానును ముదిఁ, బొంగుచుఁ గైదండఁ బూని పావనత్రివేణీ
సంగమున మునిఁగి నతజన, పుంగవనాయకుఁ బ్రయాగ మాధవుఁ గొలిచెన్. ౧౧౬

క. నాదక తైర్థికజన పరి, వారంబులఁ గూడి పెక్కువారంబులు త
ద్వారి విహారము సలిపి య, వారణనటఁ దరలి చనియె వారాణసికిన్. ౧౧౭

సీ. మణికర్ణికాతీర్థ మజ్జనం బొనరించి గంగానదీస్నాన కలనఁ దనరి
లోలార్కముఖులైన హేళులఁ దర్శించి కాలభైరవు మహాకాళుఁ గొలిచి
యాదికేశవుల సత్యాదరమున నెంచి బిందుమాధవదేవుఁ బ్రేమఁ గాంచి
శ్రీవిశాలాక్షి నక్షీణభక్తిఁ భజించి విశ్వేశ్వరస్వామి వినుతిచేసి
భూనుతములైన పుణ్యనదీనదముల, స్నానములు దానములు హితసరణిఁ జేసి
కోటిలింగస్థలములు గన్గొని కడంక, డుంఠివిఘ్నేశుఁ బ్రమథరాట్పుత్రుఁ బొగడి.

క. కయమున నచ్చో వెలువడి, గయకుం జని పితరులకుఁ దగం బరలోక
క్రియలాచరించి గోధన, హయగజదానముల భూసురావలిఁ దనిపెన్. ౧౧౯

క. కుతుకమున నంత వెలువడి, కతిపయదినములకుఁ జేరి కనుఁగొనియె మహో
న్నత వితతశృంగభాగా, న్వితతుల సీతాననంబు నీలనగంబున్. ౧౨౦

క. అంతట నింద్రద్యుమ్నస, రోంతరమున దీర్ఘమాడి యటఁ గని సుభద్రా
కాంతుక గజవనుతగుణా, వంతు జగత్స్వామి సాధువేల్పుఁ గాంచెన్. ౧౨౧

క. కాంచి ప్రణమిల్లి తులసీ, కాంచనపుష్పములఁ బూజ గావించి భక్తిని గా
వించి ప్రసాదములు గొని, పెంచి నుతింపంగఁ దొడఁగె మృదుమధురోక్తిన్.

క. పరికింపఁ బతితపావన, బిరుద మెప్పుడు నీకుఁ జెల్లు బృథివీస్థలిని
సరియగు వేలుపులేరీ, నిరుపమకరుణానివేశ నీలాద్రీశా. ౧౧౨

సీ. కమనీయ తపనీయ కౌశేయకము వాని దళదరవింద నేత్రములవాని
సంపూర్ణ పూర్ణిమా చంద్రాననము వానిఁ గరతలశంఖచక్రములవాని
బలసుభద్రా సతీ పరివృతుండగువాని నీలమేఘాకృతిఁ బ్రాలువాని
నిరుపమ శృంగార నీరధి యగువాని పతితపావనుఁడనఁ బరఁగువాని
నఖిలలోకైకనాయకుఁ డయినవాని, నిన్ను బొడగంటి శుభములు నెరయఁగంటి
నీలనగవాస విబుధవర్ణితవిలాస, శ్రీజగన్నాథ విజయలక్ష్మీసనాథ. ౧౧౩

ఉ. వాసవముఖ్య దిక్పతులవశ్యము గొల్చు భవత్పదాబ్జముల్
భాసురలీలఁ గంటి సులభంబగు మేల్గయి కాంటి విచ్చెఁబో
చేసిన పాపసంఘములు చెప్పెడిదేమిఁక నా యదృష్టమో
దాసమనోరథార్థ ఫలదాయక నీలనగాధినాయకా. ౧౧౪

గీ. శిఖరదర్శనంబు చేసినమాత్రనె, తొలఁగుచుండు నఖిల దుష్కృతములు
నిన్ను జూచుపుణ్య మెన్న నేరితరంబు, నయవిలాసనీలనగనివాస. ౧౧౫

గీ. అని జగన్నాథుఁ గీర్తించి యచటవరలి, మోదమిగురొత్త శ్రీకూర్మమునకు నేగి
నతజనశరణ్యుఁడగు కూర్మనాథుఁ గొలచి, యచటు వెడలి త్రోవఁ జనుచుండె నన్నరుండు

క. అని శౌనకాదిమునులకు ననఘాత్ముండైన రోమహర్షణి యుత్కరిం
చిన నాలకించి వారాయన నవ్వలికథయుఁ, దెలుపుమని వేఁడుటయున్. ౧౧౬

చ. సరసిజపత్రనేత్ర మునిసన్నుతి పాత్రచరిత్ర కల్మషో
త్కరలతికా లవిత్ర నిజదాస జనావన సూత్ర దుగ్ధసా
గరతనయా కళత్ర మిహికాకరశేఖరమిత్ర వృత్రిసం
హారమణీజాల నీలజలదాంచితగాత్ర విచిత్రవైభవా. ౧౧౭

క. పారావారాగారా, సూరిజనాధార మారసుషమాకారా
ఘోరాఘాభ్రసమీరా, సారదయాపూర నీలశైలవిహారా ౧౧౮

మాలిని. అతులితగుణధామా హారిశృంగారసీమా
శతధృతినుతనామా సర్వలోకాభిరామా
క్రతుభుగవనకామా ప్రాంచదాకారకామా
దితిసుతకులభీమా దేవతాసార్వభౌమా. ౧౨౦

గద్య. ఇది శ్రీమజ్జగన్నాయక దేవదివ్య కృపావిశేష సంలబ్ధసార కవితావిచిత్ర కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర సకలవిద్వజ్జన విధేయ జగన్నాథనామధేయ ప్రణీతంబయిన సుభద్రాపరిణయంబను శృంగారప్రబంధంబునందు ద్వితీయాశ్వాసము.

శ్రీ

# సుభద్రాపరిణయము

## తృతీయాశ్వాసము.

క. శ్రీరుచిరగుణనివేశా, దూరితఖలనాశ ఘోరదురితవినాశా
భూరితరసుజనపోషా, నీరజహితప్రకాశ సింహాద్రీశా.

గీ. అవధరింపుము శౌనకాద్యఖిలమునికు, లేంద్రులకు రోమహర్షణి యిట్టులనియె
నట్లు తెరవునఁ జనిచని యర్జునుండు, గాంచె ముందర నతితరోత్కంఠుఁ డగుచు. ౨

క. సింహాకారోజ్జ్వలము న్, సింహాశ్రితతలముకలుష సింధురపటలీ
సింహాయితజనముమహా, సింహావృత బిలము నైన సింహాచలమున్. 3

వ. మరియున్నమ్మహీధరంబు కైలాసధరంబునుంబోలె నీలకంఠావాసంబై మేరుశైలంబునుంబోలె నమేయనైరికభాతుంబై వైకుంఠపురంబునుంబోలె హరినిత్యనివాసంబై బ్రహ్మలోకంబునుంబోలె పరమహంససమావృతంబై యలకాపురమునుంబోలె నగణ్యపుణ్యజనశరణ్యంబై రసాతలంబునుంబోలె ననంత నాగేంద్రాక్రాంతంబై పా

ష్టానిధానంబునుంబోలె నక్రాంతబాడబాశ్రయంబై త్రిదివంబునుంబోలె ననవరత
రంభావిజృంభమాణంబై మహారాజన్యరాజ్యంబునుంబోలె నపరిమిత కటకవిశంక
టంబై సుకవికావ్యంబునుంబోలె ననేక మత్తకోకిల వ్యాకులంబై నైమిశారణ్యంబు
నుంబోలె శుకముఖ ద్విజకులాలంకృతంబై యొప్పు నప్పర్వత వతంసంబుంగనుంగొ
ని పరమానందకందళిత హృదయారవిందుండై తదీయోద్ధిత్యకారోహణంబొనర్చి
యందు బహు సహస్రసాదంభశుంభ జృంభ జన్మణిస్తంభ సంభావితంబును చంచ
త్కాంచన పాంచాలికాసంచయ సముంచితంబును నభ్రంకషోత్తుంగ శిఖరావలంబి
శాత కుంభకుంభగుంభితంబును మనోహరి హీరసోపాన విలదఙ్కా విటంకకుట్టిమ
విభ్రాజమానంబును గవత్క్వణ కవాటాగళ ద్వారబంధబంధురంబును నవరత్నఖ
చితోత్తాలసాల గోపురప్రాసాద మంటప ప్రదీపితంబును భరతత్త్వవిద్యాధురీణ వ
రనుభాగవతోత్తమనిపఠిత వేదనాదమేదురంబును సురూపలావణ్యాగణ్య పుణ్యాంగ
నాన్వృత్తగీతవాద్యధ్వానమానితంబును హనుమద్గరుడ శేష విష్వక్సేన జయవిజయ ద్వా
దశసూరిజనాధిష్ఠితంబును కౌశిక కాలాగరు కర్పూర సాంబ్రాణికా ధూపవాస
నావాసితంబును సదోద్ఘృతకృత ప్రదీపదీపితంబును బహుళాపూపసూప పరమాన్న
ఫల దధి మధుశర్కరాఘృతోపేత మహానైవేద్యహృద్యంబునునై రెండవ వైకుం
ఠధామంబునుబోలి విరాజిల్లు శ్రీమద్వరాహ నృసింహదేవ దేవాలయంబు పొడగని
నమస్కరించి యంతట గంగధారాది చతుర్వింశతి ధారానీరంబుల గృతావగా
హుండై తులాపురుషాది మహాదానంబులొనరించి గర్భాగారంబు ప్రవేశించి.

సీ. మేదినీతలగుప్త పాదద్వయమువాని విమలసంస్తబ్ధకర్ణములవాని
నవిరళత్రివళి సమన్వితుండగువాని కమనీయధవళ విగ్రహమువాని
విస్ఫుటపటుసటా విలసితుండగువాని దంష్ట్రికరాళ వక్త్రంబువాని
మృదులాంసభాగ విస్తృత వాలమువాని నంచిత నేత్రత్రయంబువాని
లాలితోత్తాలభుజయుగళంబువాని, సింహశైలేంద్రనిలయుండై చెలఁగువాని
శ్రీసమేతు వరాహనృసింహదేవుఁ గాంచె నృపమాళికన్నులకరవుదీఱ. ౫

గీ. అట్లుగన్గొని సాష్టాంగమాదరించి, మాలతీతుల సీమంత మయసుమముల
బూజగావించి గంధతాంబూలధూప, దీప నైవేద్యములొసంగి ధృతినుతించె. ౬

క. పూరుషహర్యక్షసుధీ వారావనదక్షదివిజ వల్లభపక్షా
మోరారిక్షమజశిక్షా, సారకృపావీక్ష సింహశైలాధ్యక్షా. ౭

క. నిను సేవించిననరులకు, మునుకొని ఘనభోగభాగ్యములు చేకురు బో

సనకాదిసకలసన్మునీ, జనరక్షణ రంహసింహ శైలనృసింహా. ౮

మ. హరినీవేగతి నాకటంచు మును ప్రహ్లాదుండు ప్రార్థించినన్
గరుడారూఢుండవై సమగ్రకృపవేగన్ వచ్చియబ్బాలకుం
గరిరక్షించిన మేటివంచు నిను నేఁ బ్రార్థింతు నన్బ్రోవుమీ
యరిమత్తద్విపసింహవీరనరసింహా సింహశైలాధిపా. ౯

గీ. అనుచు వినుతిచేసి యచ్చోటు నెడబాసి, సకలతైర్థికాదృష్ట జనులఁ గూడి
కురువరుండు విహిత గోష్ఠిమార్గము పట్టి యరిగె కతిపయప్రయాణములకు. ౧౦

మ. కనెనభ్రంకష దేవతాభవన రంగస్థాననృత్తక్రియా
ఘనసంరంభ విజృంభమాణ దివిషత్కాంతా నిభాకార భూ
రమణీలాగణ్య విలాసగణ్యగణికా పంచాస్త్ర కేళీకళా
త్యనుమోదాంచిత హృత్సరోరుహుని దాక్షారామ భీమేశునిన్. ౧౧

ఉ. కనిసాష్టాంగనమస్కృతుల్, లొనరించి పూజించి మిగుల నుపహారంబుల్
దనివిసన నొసఁగి యద్దే, వుని సత్కృపవడసి పొంకవుండటకదలెన్. ౧౨

గీ. కదలి యంతమాత్ర గమనాపహారిణి, యనుసమస్తకల్మషోగ్రభుజగ
ఖగవరంబునైన గౌతమికేతెంచి స్నానదానవిధులు తమినొనర్చి. ౧౩

గీ. అమ్మహానదిదాటి వైళమ్ము తరలి, కృష్ణవేణ్యాదిశుభతరంగిణులయందు
మునిఁగి మునిఁగి యమానుషుండై యనవిభుండు, చనియె గొన్నాళ్లకెలమి శ్రీశైలమునకు.

క. చని మల్లికార్జునస్వా, మిని బొడఁగని విమలభక్తి మీఱంగ బూజల్
బొనరించి యమ్మహాద్రే, పుని మధురవచోనిరూఢిఁ బొగడఁదొడంగెన్. ౧౫

క. పరిమదమున నన్ను బ్రోవుము, భ్రమరాంబావదనకమల భవ్యపతంగా
శమదఘనమదవిభంగా, యమలకృపాపాంగ మల్లికార్జునలింగా. ౧౬

సీ. ఓంకారరూపిణే పంకజాతభవాది నిర్జరార్చితపాద నీరజాయ
గజచర్మచేలినే త్రిజగజ్జనావనదక్ష కారుణ్య నిరీక్షణాయ
చిరసౌఖ్యదాయినే పురహరాతమణి సదృక్షమనీయ్య తరనీలకంధరాయ
పార్వతీపతయే సగర్వపూర్వామర పూర్వరూపహ భూరిభుజబలాయ
శమన శమనాయ శర్వాయ శాశ్వతాయ, శరధితూణాయ శంభవే శశిధరాయ
శశకురంగాయ పరిచితశతమఖాయ, శైలభవనాయ తేన మశ్శంకరాయ. ౧౭

గీ. అనుచు నుతినతులొనరించి యచట వెడలి, పరహ్యాతమహాంహుల శ్రీయహోబలనృసింహుఁ
జేరి భజియించి యిష్టార్థసిద్ధివడసి, నరగనంతట వేంకటాచలముచేరి. ౧౮

సతతయాతాయాత సమధికపథికనికాయమోద క్రాయమానాయమాన
విలసదేలాలతా వేల్లితక్రముకాది మహీజశాఖాంతర కుమారవిహార
మాణవివిధగరుద్రథ మధురమధుర, కలకలోద్వేల వేలాధిగతమనోజ్ఞ
మార్గంబున నాప్తతైర్థికవర్గసహితుఁ, డగుచు రామేశ్వరంబున కరిగియందు.

గీ. సేతుదర్శనమొనరించి కౌతుకమున, నెరిధనుష్కోటిలోన మునింగివిహిత
దానములభూసురావళిఁదనియఁజేసి, రామలింగంబుఁ గొలిచియారాజసుతుఁడు.

వ. అచ్చటనుండి పదమూఁడవనెలఁ బాండ్యదేశాధీశ్వరుండగు మలయధ్వజుం డేలు మ
ణిపురంబుఁ జేరి తత్పురోపకంఠసముద్యదుద్యానవాటికాంతరంబున సుఖోపవిష్టుం
డై వినోదించు సమయంబున. ౩౨

చ. పొలిచె వసంతకాలము ప్రఫుల్లమనోహర మల్లికావిని
ర్గలమకరందపాన రతమత్తమధువ్రతమంజునాద సం
చరితవియోగినీపథిక జాలము వ్యాధ్భయదప్రచండకో
కిలశుకశారికారవనికృత్త సమస్త దిగంతరాళముల్. ౩౩

చ. అవని వనీవధూటి తమి నాడెడునీలపుబంతిచాలునా
నవిరళలీలనప్పుడు వనాంగణవీథిఁజరించెసంచుగాఁ
బ్రవిమలమాధురీమహిత బాలరసాల వనాలమంజరీ
నవనవమాకరంద రసనందితమత్తమిళింద బృందముల్. ౩౪

క. నవకుసుమ లసితకింశుక, నివహంబులు చూడనొప్పె నెటివప్పుడు మా
ధవుఁడు వనలక్ష్మి కొలిపుగ, సవరించిన పద్మరాగ సౌధములనఁగన్. ౩౫

గీ. తత్రియనెడు మావటీఁడు మాధవవిభుండు, స్వారివెంజేయుచో నిడ్డచంచదరుణ
రాంకవాంకిత మదసింధురములనంగ, రమణఁబూచిన కాల్మలి ద్రుమములలరె. ౩౬

సీ. పరిఫుల్లమల్లికాప్రసవమరంద పానాలోలరోలంబ జాలకంబు
కలితామ్రపల్లవగ్రాసావలేపాతిరేకకూజన్మత్తకోకిలంబు
మధురఫలాహార మాంసలవాచాల సమదశారీకీర సంవృతంబు
బహుళకోశమధురసపరిపానలంపట సరఘాకులారావ సంకులంబు
సారఘనసారధూళికా సాంద్రతరప, రాగసమ్మేళనావిశభ్రామ్యదళిమ
గంధగంధిల మంధరగంధవహము, భాసురంబొప్పు మధుమాసవాసరంబు. ౩౭

గీ. అలరువిల్కాఁడు పాంథులఁ గెలువఁ, బూనిస్వారి వెంచేయఁగలఁడని సమయభటుఁడు
రమణఁగట్టిన మణితోరణములనంగ, మ్రాకులం డెల్లచిగురుజొంపములువిరిసె

క. వనలక్ష్మీమాధవులకు, ఘనతరవిభవమునఁ బెండ్లి గావించుటవా

మనియిడ్డకనకవేదిక, లనఁగాఁ గాంతాళుగుప్త లలరెఁ బవనులన్. ౩౫

సీ. మాధవీసుమబృంద మకరందరసఝరీ హాలామదోద్వృత్తి సోలిసోలి
బాలావిలోలాళి చేలాంచలాజాల డోలావిహారాప్తిఁ దేలితేలి
సారసౌరభ మిళత్సారిఫుల్ల మల్లికావల్లికా తతులపైఁ ద్రాలిత్రాలి
లీలావలన్మహోత్తాల బాలరసాలసాల మంజరులపై వ్రాలివ్రాలి
బాళిశైవాలజంగల్వకేళికలను, మేలికింజల్కరజముఁ గ్రోలిక్రోలి
హాళిఁ గేళీమహారామ పాళులందు, నోలిఁ గ్రీడించె సరసమత్తాళులపుడు. ౩౬

సీ. మంజులగుంజాని కుంజసంజ వనాంతముల జెంతదాఁగుడు మూతలాడి
మహనీయమంజరీ మహితమాకందశాఖలఁ గోతికొమ్మన గజ్జులాడి
యుల్లసత్సంపుల్ల వల్లికామల్లికా జాలకాగ్రముల నుయ్యాలలూఁగి
వికచచంపక భూజవీథికాంతరములఁ బసిగొని నెరిఁబారు పట్టెలాడి
మేలిపన్నీటి వాకలనోలలాడి, కమ్మకప్పురంపుఁ బూదిపైఁ జిమ్ములాడి
లీలఁ గ్రీడించె సరసవనాళులందు, మందగంధసమీరడింభకము లెలమి. ౩౭

ఉ. ఎక్కడఁ జూచినం బకము లెక్కడఁ జూచిన కీరశారికల్
టెక్కరిగండుతుమ్మెదలు డాగిహళాహళి సేయఁ జొచ్చె నా
చక్కెరవింటిజోదు విరసంబునఁ బాంథులఁ జుట్టిముట్టెనా
దిక్కుల మూకలం బరపి దిగ్గనముట్టడి వెట్టెనో యనన్. ౩౮

క. అట్టియెడఁ జెలిమికత్తియ, లట్టియలై కొలువ మణిపురాధిపు ముద్దుం
బట్టి సురూప గుణంబుల, నట్టగు చిత్రాంగదాంగనామణి కడఁకన్. ౩౯

సీ. సిలుకడగాంచి దిక్కులఁ దళుక్కన వెన్నెదీపించు క్రొమ్మించుదీవయనఁగ
చెలువు విల్కాఁడు గొట్టి వెదకి పాంథులమీఁద ఝళిపించు మోహనాస్త్రంబనంగ
రతిసతీమణి కేళి నటించు తూనాలలీల బూనిన రత్నంపుబొమ్మయనఁగ
నింగిగోలంగి వన్నియమీఱఁ బుడమిపై మెలఁగుపెన్నెల రేని కళయనంగ
నలువ చెలువకొట్టమునుండి వెలుడియొరపు, కదురఁబోవ లేఁతురాయంచకోదమయనఁగ
నరిది సింగారమేపార హాళినపుడు, వచ్చెఁ జెచ్చెర సుద్యానవాటమునకు. ౪౦

క. వచ్చియనంగులు దానును, విచ్చలవిడిఁ గ్రొంజిగుళ్లు విరులుం బండ్లుం
గోచ్చుకొని తవిలిఁ గోయం, జొచ్చిరి స్మరసైన్యభుక్తిఁ జూరఁగొను క్రియన్. ౪౧

సీ. మధుమక్షికలఁ దోలి మధురసంబులు గ్రోలి తలిరులు చిదిమి కోయిలలఁ గదిమి
ఫలములు రాల్చి రాచిలుక పోఁ జూనఁ దల్చి యెలదుల్లు ద్రుంచి తేఁటులఁ గలంచి
నీటులుప్పూని పన్నీటు వాఁకల నాని గొదగొని తారిపూఁ బొదలమాని

దాఁకపందిరులెక్కి తనియబండలు మెక్కి బడిబడిఁ గ్రిమ్మి పుప్పొడులుచిమ్మి
పాళిఁజెలరేఁగి తీఁగె యుయ్యాలలూఁగి, కూటువలుగూడి ననచెండ్ల వ్రేటులాడి
కప్పురము రేఁచి ఘనసార కదళులూఁచి, చెలులుపుష్పాపచయకేళి సలిపిరప్పుడు.

తే. కలికియొక్కతె కేతకీగర్భదళము, గోయుటకుఁ గొమ్మవచ్చుచో గుసుమరజము
వెకలికన్నులఁగప్పినఁ బిమ్మటఁగొని, పుడమిఁజదికిలఁబడి యొట్టుబొబ్బరించె. ౪౪

ఉ. బాలమృగాక్షియోర్తు నవపల్లవసల్లలి తామ్రశాఖపై
గేలటు సాఁచి కెంజివురు గిల్లిన నచ్చటఁ దాఁగియున్న మ
త్తాననకోకిలంబు చిగురాకని ముక్కున నొక్కి నొక్కి నం
దాలిమిఁ దూలియుల్కిపడె దానిఁగనుంగొని నవ్విరంగనల్. ౪౫

ఉ. సంపెగకొమ్మవంచి యొకచంద్రదళాననపూలుగోయఁగా
జంపకగంధియోర్తుఁ గని సయ్యనదానినదల్చి పాంథులం
బెంపరఁజేయు తుమ్మెదల పింఛమడంచు సుమంబులేటికిం
త్రుంపఁగఁబోయితంచెడయఁ ద్రోచెఁ గరాబ్జము పట్టిలాగుచున్. ౪౬

గీ. మొగలివిరిమీఁదమూఁగిన మొకరితేంట్లు, నొక్కచెలి రేఁపుటయు నవి యొక్కపొలఁతి
మోమువిరిదమ్మియని వెనముసిరిదాని, నానగనిగంధఫలియుంచుఁ బాసెయూరిక,

సీ. నిట్టూర్పుచేనొక్క నెలతుకవావిలి జేఁగంటి యొకమందయానమానివి
గౌఁగిటఁజేర్చె నొక్కలతాంగి గోరంటమాటాడి యొకహరిమధ్యగోఁగు
మోముచేరిచియొక్క వామాక్షి సంపెంగఁ బుక్కిటిసురనొక బొలఁతిపొగడఁ
బళుకుఁజూపులనొక్క చెలితిలకప్రమూను జిన్నినవ్వులనొక్క కన్నెపొన్న
ప్రేమతోఁబాడి యొకచేడె ప్రేంకణంబు, దాచియొకలేమ కంకేళితరువరంబు
నలరులెత్తించి సరసవిహారలీల, నలరుచుండిరి సంతసంబతిశయిల్ల. ౪౭

గీ. అట్లు వనకేళిగావించి యబలలెల్ల
బూలుదలిరులు ఫలములు చాలసంగ్ర
హించుకొని ఘర్మ వారివారించుకొఱకు
నంతజలకేళి యొనరింప నదనుదలఁచి. ౪౮

ఉ. ఆరమణీలలామములు దంచితలీలలఁ గాంచి రొక్క కా
సారము సారసౌరభవిశంకట సారసపుండరీక క
హ్లారమరంద పానపరిలంపట మాద్యదళీంద్రసాంద్ర ఝుం
కారము కోకహంస బకకచ్ఛపమీన ఝుళీకుళీరమున్. ౪౯

గీ. అట్లుగనితత్తటంబున యొందుమేలి, తొడవులును బట్టములు వెట్టి బెడఁగుగట్టి
పావడలుగట్టి శృంగముల్ వట్టివారి, కేళిపైవాలి పుట్టికేకిసలుగొట్టి. ౫౦

క. పట్టుగలచంద్రకాంతపు, చట్టులచేఁగట్టినట్టి పవరదవపుబల్
మెట్టులవెంబడిడిగిచని, బిట్టురికిరినీట గుభగుభుల్ గుభురనఁగన్. ౫౧

వ. అట్లురికి. ౫౨

సీ. నిగనిగలిగురొత్తు నగుమొగంబులతోడ నిద్దంపునిడుసోఁగ నెరులతోడఁ
గులుకుసిబ్బెపుగబ్బి గుబ్బచన్నులతోడఁ దళతళలీను నేత్రములతోడఁ
బసనిండువాటంపు బాహువల్లులతోడ బంధురోన్నత నితంబములతోడఁ
గమనీయమృదుతర కరపదంబులతోడ నెసమించు వెడమత్తనులతోడఁ
బొలుచు మాతోడనెల్లెడఁ జోలుసరసి, సరసిరుహమత్స్యదరరథాంగఝషమృణాల
పులినవల్లకవీచికా కలితయగుచు, నెంతపొరలిన వనికేళిరింతులప్పుడు. ౫౩

ఉ. వేడుకతోడబాడుచును వీడుచుఁ గూడుచు నీటఁజల్లుచో
రాడుచనోలయోలయని యీఁదటవీఁదుచు మించిముస్గుచున్
వేడబమొప్ప నీలఘన వేణులు క్రీడలొనర్చిరెంతయున్
గోడెమెఱుంగు గబ్బివలి గుత్తపుగుబ్బల బంటిలోతునన్. ౫౪

చ. మెలఁతుకయోర్తు తమ్మివిరి మీఁదిమదాళులఁ జూపనయ్యలన్
చెలియమొగంబుపద్మమని చేరిన నచ్చెలి చేతితామరం
బులమరుదోలుచున్న వటగాసి కుచంబులు తమ్మిమొగ్గలం
చలమిని వాలితూలి పరువెత్తివడిన్నెయి తావిపవీకానన్. ౫౫

సీ. తనబోఁటియనుచుఁ దత్తటవిహారరథాంగ మొకకొమ్మగుబ్బచన్నొడసిపాడిచెఁ
దనకులపాఁవము లందఉవచ్చిరోయని భ్రమరియొక్కతెవేణి భ్రమరివారె
వింతతూఁగ్లివియరచుఁ జెంతఁద్రిమ్మనవంచ యొకలతాతన్వి బాహువులఁగరచెఁ
గ్రొత్తవిందులు వరిగూడి యాడుదమంచుఁ గచ్ఛపంబొకతె మోఁగాళ్ళఁ జెనఁగె
నమితలావణ్యతారుణ్య వారిభూరి, సుందరాకార రేఖాభి శోభితాతి
దివ్యశృంగారలీలలఁ దేజరిల్లెడు, నృపతికన్యలు జలకేలి నెరపునపుడు. ౫౬

ఉ. బోటియొకర్తు నీటిపయిఁ బోరగిలంబడి యీఁదియీఁది మే
పాటవమొందియుందు నెడఁ బల్లవపాణి యొకర్తువెల్కనో
పాటలగంధి వికచవిభాస్వర కుంభయుగంబు గల్గఁగా
నేటికి నీటికిన్ వెఱవనీఁతకుమిక్కిలి లోఁతుగల్గనే. ౫౭

మ. ఒకనాఁడీమణి పద్మనాళమున నీరొప్పార్పఁ బూరించి వే
ల్పొకబింబాధర మీఁదఁ జూఁ దనదియో హొగ్గాకాచికొమ్మంచుఁ బూ
నికతో నీటమునింగి యీఁది చనియన్నీరేజపత్రాక్షి వా
లిక కన్నుంగవ మూసి మంచివిడిచెన్ లీలావతుల్ నవ్వఁగన్. ౧౮
సీ. తమయానవిస్ఫూర్తిఁ దాల్చనోయవియుంచుఁ గలహంసతతులఁ బోఁగఁదిమిగదిమి
తమముంగురులసాటి దనరునోయివియంచుఁ దుమ్మెదగమిఁ బాఱఁ దోలితోలి
తమకుచంబులపోల్కె నమరునోయివియంచుఁ దరలిఁ జక్కవలఁ బోఁ దరమితరమి
తమమొగంబులఁబోలఁ దలఁచునోయివియంచు మంచితామరవిరుల్ దుంచితుంచి
నిజపయోధరకుంభ వినిగళత్కస్మ, సారసారంగ మదఘన సారగంధ
సారకాస్మీరహిమనీర సౌరభాళి, వికటకాసారముఁ గేలి రతివలపుడు. ౧౯
మ. రమణీయాలకజాలక భ్రమరముల్ రాజన్మహోరోజ చ
క్రములత్యంత విశాలలోచన విసారంబుల్ కళావిస్ఫుర
ద్విమలాస్యాంబుజముల్ భుజాబిసములు ద్విప్రతింబ్రకాశింప జం
గమకాసారములో యనంబొలిచిరా గంధేభరాడ్గామినుల్. ౨౦
గీ. అంతజలకేలిచాలించి యబ్జముఖులు, తటతలంబునఁ జేరి కుంతలములార్చు
కొనితురుంబము లలరించుకొనివిభూష, ణాంబరాదికములు దాల్చి యచటఁ బరలి. ౨౧
గీ. మరలవనిఁ బ్రవేశించి మనసిజాత, దేవతాసార్వభౌముఁ బ్రతిష్ఠింపఁ గోరి
సరసకిసలయులసిత రసాలసాల, మూలమునఁ గ్రపపుటవంటి మోఁకరింద. ౨౨
క. నిగనిగమను తొగరారా, జిగితెపయిన్ మృగమదంబు సాంకవమగరున్
మొగిగలిపి యలికినను గొంగ, జిగికప్రపు ముగ్గులిడివిచిత్రింపవయన్ ౨౩
గీ. అందుఁ గెందమ్మిసెజ్జపై నిందిరాత్మ, మారుగస్తురిచే వ్రాసి మరియుఁ దరిని
రతిని లిఖియించి మందమారుతవసంత, శుకవనప్రియ మధుప శారికల వ్రాసి. ౨౪
గీ. పత్రపుష్పగంధ ఫలమధురసములఁ గోరి షోడశోప చారవిధులఁ
బూజచేసి పూఁపుబోఁడులాతతభక్తిఁ, దగిలియిట్టులనుచుఁ బొగడిరపుడు. ౨౫
సీ. దండ ముద్దండదోర్దండ విమండిత చండపుండ్రేక్షు కోదండనీకు
జోహారు సరసఘనాహార మృదుతర వ్యాహారభాకేరవాహనీకు
వందనంబిందిరా సుందరీహృదయార విందసంధానితానందనీకు
నతి శతక్రతుముఖాదితసుతస్తుతమహా ద్భుతఘనవిక్రమ వితతనీకు
మోడ్పుకెంగేలు సమధికాంబుజభవాండ, ఖండసంవేష్టితాఖిల ప్రాణిహృదయ
భేదనప్రక్రియాచణ స్ఫీతశాత, చూతకోరక విశిఖసంఘాతనీకు. ౨౬

క. మారాయభూరిశరసుకు, మారాయరమాసతీకుమారాయమహా
దారాయరతివధూటీ, దారాయవియోగినీజదారాయనమః. ౭౧

మత్తకోకిల. గాలి తేరును దుంటవిల్లును గండుతుమ్మెదనారియుం
బూలకోలలు మీను టెక్కెము పుల్గుమావులు గాఁగా
హాళిమై మగలంబడంతుల నల్లిబిల్లిగఁగూర్చియేల్
మేలుబంటవు నిన్ నుతింపఁగ మేము నేర్తుమె మన్మథా. ౭౨

గీ. అని మనోభవుఁ గొనియాడి వనజవదన, లెల్లఁగుసుమాసవము గ్రోలనిచ్చపుట్టి
కనకఘటమున సీధువునినిచి పసిఁడి, కోరలం బోలి వడ్డించుకొని చెలంగి. ౭౩

గీ. గుటుకు గుటుకునఁ గ్రోలుచుఁ గొసరుకొనుచు
జవ్వలు వూచుచు నిదియహా సరసమధుర
వస్తువని కొనియాడుచు వాసనలకు
జొక్కుచును సోలుచును ద్రావఁ జొచ్చిరపుడు. ౭౪

క. కుమ్మరిసారెవిధంబునఁ, ద్రిమ్మరఁగాఁజొచ్చెఁబుడమి దిరిగెరవిపుడ
మ్మమ్మ కనుంగొనరేయని, పిమ్మటఁగొనియోతుక కేలు బిరబిరఁద్రిప్పెన్. ౭౫

ఉ. పయ్యెరవావ నాజలుగుఁ బయ్యెదదియ్యకు చంటిమీఁదఁ జే
వెయ్యకు మేన్గుపొడువ వేగిలిగింతలు పెట్టరాకు నీ
నెయ్యము చాలుఁబొమ్మనుచు నిబ్బరపున్మద రామదంబునం
దొయ్యలియొర్తుక మైమఱచి తూలిపడంకంగఁ జాగెనయ్యెడన్. ౭౬

క. పెదవింటితాత తాతా, వడిఁబైకొని నన్నుఁజెవక వచ్చెదవహహా
యొదలెఱుఁగవాయని త్రుళ్ళుచు, పడఁతుల తలమిన్నయొర్తుక పకపకనవ్వెన్.

సీ. తుంబురుండీడెనాతో గానముననంచువీడన తందనల్ పాడె నొకతె
రంభనాకనయె నర్తనకళా విధినంచు వెసవెడ గంతులు వేసె నొకతె
రతినాకుసరియె యంచితరూపమున నంచుమించుపూనిక వెక్కిరించెనొకతె
వాణినాతో సాటి వచ్చునెచదువున నంచుఁ ద్రేలుచుగాఱు లాడెనొకతె
బహుళతరువరసంజాత పత్రిమూల, ఫలకుసుమసారశర్కరా మిళితమధుర
వారుణీపానకలనా ప్రమథ్యమాన, మరభరోన్మాదమున నెదమరపుగదిరి. ౭౭

సీ. మదిరాక్షియొక్కతె యిదె ప్రియుండరుదెంచె నంచుబయల్ గాఁగిలించుకొనియె
వెలఁదియొక్కతె భర్త విడెముచుట్టెదనంచుఁ దివురొప్పఁగానోరు దెరచుకొనియె
చెలువయొక్కతె పతి జిలుగుఁబయ్యెదయూడ్చె నంచు బొమ్మునఁ జేతులానుకొనియె
పడఁతియొక్కతె నీవి సడలించె విభుడంచు మరునిల్లుహా కేల మాటుకొనియె

నింతియొక్కతె ధవుఁడు గిల్గింతలిడియె
నంచు నెమ్మేనఁ బులకములంకురింప
నులికిపడుచుండె నయ్యార్తె బలితమైన
మధుమదోన్మాదమున నొడల్ మఱచి యపుడు. ౭౮

సీ. అక్కడక్కడ నిల్చి గ్రుక్కిళ్లు మ్రింగుచు సురకుఁ దారెదరేల చుక్కలార
చేయెత్తి మ్రొక్కుచు సీధువుఁ డెమ్మని తవిలి వేడెదరేల తరువులార
పావలమాటునఁ బొంచి మదిర మ్రుచ్చిలిపోవ మిత్తిఁ జూచెదరేల మేకములార
మ్రాకులపైఁ జేరి మధువు గ్రోలఁగఁ గోరి చెలఁగి కూసెదరేల పులుగులార
యాసవము శాసవంబడి నంటి జంట, వీడకుండెదరేటికి నీడలార
యనుచుఁ గొందఱు వినబోడులాము మీఱి, పలువరింపుచునుండి రబ్బురము తోప. ౭౯

గీ. అట్లు వనవీథిఁ గ్రీడించి యనుఁగు జెలులఁ, బెరసి క్రమ్మర నగరున కరుగుచున్న
పాండ్యనృపపుత్రిఁ గనుఁగొని పాండవేయుఁ, డెదము వందావహిళ విశారదుని కమొ[illegible]

క. ఎవ్వరిచిన్నదొ యీయాయెల, జవ్వనిపూఁబంటి మేఁటి సామరికేలన్
నివ్వటిలు మెఱుఁగుఁబాయల, క్రొవ్వాడి కటారి యనఁగఁ గొనబువహించెన్. ౮౦

ఉ. అద్దిరదీనిముద్దు మొగమచ్చపు పున్నమచందమామ తో
నుద్దిరకన్నుదోయి వికచోత్పల పంక్తులనేలఁ బోలు మేల్
నిద్దపుటద్దపుంబలక నిగ్గులనెగ్గులు వల్కు జెక్కులీ
ముద్దియసోయగంబరిది మోహము గొల్పె మనోజ్ఞవీథికిన్, ౮౧

ఉ. కన్నులవింటిదంట శితకాండపరంపర గ్రుమ్మరించు నీ
యన్నులమిన్న కన్నుఁగవ యద్దిర గద్దరి తేఁటిదాఁటులన్
బన్నము నొందఁ జేయఁగద బాలనిగారపు సోఁగపెన్నెరుల్
క్రొన్ననబంతులం దెగడుఁ గొమ్మమిటారపు గుబ్బగుబ్బలన్. ౮౨

సీ. కొమ్మెడల్ నెలవిండ్లు తొగలు సంపెంగమొగ్గ శ్రీలద్దములు మగరాలు కెంపు
దరము మృణాలముల్ తమ్ములు జక్కవల్ భుజగంబు తరగలు పొన్నపువ్వు
సింగంబు పులినమరంగులు దింపెనపూవంటు కబ్బముల్ పాదులు కమఠ
ములంచిగురాకులు ముత్తియంబులు పటఫలములు ఫలకంబు బంగరంబు
గూచిన నెత్తమ్మి పూజూలికొంతలేని
షోడతనమూని యిమ్ముద్దు పువ్వుబోడి
బోడిమి దలిర్పన్ నొనంపఁ బోలునట్లు
గాకయుండిన నీసొగుగలదె యొరుల.

ఉ॥ కన్నుల విందటి దేవర జగంబు భ్రమింపఁ గనిద్ధమేల్పడా।
ర్వన్నెక పోని బంగరుపూ రంగులజంద్రపుబొమ్మయేమొనా।
కన్నులకబ్బురంపు జిగిగొల్పుమనుండియయూరుపూర్వడి।
యున్నలమిన్న సోయగముపోవుదికెంతయునాప లోల్పడిక్ ౭౪

ఉ॥ గుబ్బికపుంగలించుకొని గుత్తపు గుబ్బలు కేలనొక్కుచున్।
ముచ్చిక పొచ్చ్ర గచ్చుకొనిమాటికి జక్కరమోవియానుమన్।
నిచ్చలుదీనిఁగూడుకొని నెమ్మివసింపకయున్న వన్నెహా।
పచ్చనివింటి దంటపలు బాములబెట్టక నిల్వనిచ్చునే ౭౫

క॥ అనియుని వారిణమోహం। బున దవరుచునున్న పాండుపుత్రునిఁగని యి
ట్లనియె విశారదుఁడప్పుడు। వినయ వివేకాతిశయము విస్తరిలంగన్ ౭౬

గీ॥ అవనినాయక మలయధ్వజావనీశ। తిలకుగారాబు పట్టి యీకలికిమిన్న
పేరుచిత్రాంగద యటంద్రు చారురూప। కులసుశీలాది గుణముల వలరు జూపి

క॥ అనిన విశారదుఁ గన్గొని। యనియె ధనంజయుఁడు మణిపురాధిపు పురికిం।
జని మా రాకయు దలఁచిన। పని యా రాజునకుఁ దెల్పి పరువడి రమ్మా. ౭౭

సీ॥ అనుడు విశారదుఁ డప్పుడే మణిపురంబున కేగి యమ్మహీభుజునిఁ గాంచి
యతనిచేత సపర్యలారూఢిఁ గైకొని వాసవి యచటికి వచ్చుటయును।
వనమున జిత్రాంగదను గాంచుటయు దానిఁగూరిమిఁ బెండ్లాడఁ గోరుటయును।
జెప్పిన సంతోష చిత్తుఁడై యవ్విభుండర్జును సన్నిధి కపుడె చని య
నేకభంగుల నతని బహూకరించి। తోడుకొని తెచ్చి యొకపైడి మేడలోన।
నిలిపి మజ్జన భోజనాదులఁ బ్రతృప్త। హృదయుఁగా, జేసి యుడుగర లిచ్చి యంత.

గీ॥ ప్రాజ్ఞులఁ బురోహితామాత్యబంధుజనుల। నెల్లరావించి యర్థం బెఱుంగఁ జెప్పి
శుభముహూర్తంబు నియమించి యభిమతముగ। లలిఁ బురమునంతి పురమునలంకరించి

సీ॥ మంగళతూర్య మృదంగ నిస్సాణ కాహళ భేరికారావములు చెలంగ
క్రమముగా గణికానికాయంబున తిరంపఁ గరదీపి కాసముత్కారము మెరయ।
బిజుసులు చివ్వలు మెఱుఁగు చంద్రజ్యోతులును నభోవీధి వెలుంగఁ జేయ
మేదినీదివిజుల వేదనాదము లొప్ప। తమిబేర టొంద్రు గీతములు వాడ
సకల వైభవములతోడ జన విభుండు, తనదు గారాబు పట్టినుత్తమగుణాప్ర
చారుఁడగు సవ్యసాచికి ధారవోసి, ప్రేమవిధ్యుక్త పద్ధతిఁ బెండ్లిచేసె ౭౮

వ॥ అట్లు మహోత్సవంబు గను వ్వాహంబొనర్చి, మలయధ్వజావనీవల్లభుండల్లునికి
గజతురగరమణీమణి భూషణాంబరాదికంబులు డుగరలొసంగి గారవించియుండె

న నరిచిన మోహంబునవయ్యర్జునుండు చిత్రాంగదా మదాలివేణింగూడుకొని గాఢపరి
రంభ చుంబనాది సంభోగలీలా విహారంబుల నుల్లసిల్లుచు గొన్నిమాసంబు లచ్చట
నివాసంబు జేసి యంత నారాజు చేతననుజ్ఞాతుండై యందులందరలి, ౧౦౨

క॥ దక్షిణ పుణ్యక్షేత్రము, లీక్షింపుచు నతిగ యరిగి యెదుటంగ నెనరుం,
దక్షిణమోక్ష సంగ్రహ. దీక్షన్ సౌభద్ర నామతీర్థోత్తమమున్ ౧౦౩

క॥ కనితత్తీరాంతరమున, మును గంబోవుటయునచటి మునివరులో హో,
చనవలవదు సువిస్మయపు, ఘనసాకనక్రంబు మెఱుగు ఘోరాకృతితోన్ ౧౦౪

గీ॥ వారిమునుఁగఁబోవు వారినిందులనని, వారితో గ్రసక్తి వారిచరము
పట్టి మింగుచుండు పట్టిమాటలుగావు, పోవవలదు వలదు భూపచంద్ర ౧౦౫

క॥ ఓ కోడయిక్కాలంబున, నూర్కదుల బట్టిబలిమి నూల్కొనుచుండన్
గాలి మొసలి యొక్కటిమురి, మీఱఁగ జంతువులబట్టి మింగుచునుండున్. ౧౦౬

సీ. మోక్షంబునకుఁబోవ మొసళ్ళెత్తుకొనిపోవు ననెడుసామెత నిక్కమగునటంచుఁ
జొరబోవ వెఱతు రెవ్వరునిందులోన నీవతిసాహసముపూని యరుగఁదగునె
యనవలంతిగనవ్వి యర్జునుండశ్వుడై వెఱవక నీటిలో సుఱుకుటయును
దర్పంబెలర్పంగ దటుకున నెగసి నక్రముపట్టుకొనిన నక్కవ్వడియును
నడమకరమువఁబట్టియయ్యెడమకరము, సేపునైశార బైలికి నీడ్చివైచె
నెచటయును నదినైజరూపంబుబానీ, రక్షానిజూపర కల్లనబ్రంబుదోష. ౧౦౭

ఉ. గుత్తపు గుబ్బచన్నులును గ్రొత్తజగాజిగి కావిమోవియున్
బిత్తరితళుకు జూపులును నిద్దపుముద్దు మొగంబుదమ్మి యుం
గ్రొత్తమయూరపింఛ నిభమంజులవేణియు గల్గిలీలతో
నత్తటిదొంటినాయగపు టచ్చరయై తగమ్రోలనిల్చినన్, ౧౦౮

క. ఆరమణీమణిఁగాంచి ఫ, ల్గురమణాగ్రేసరుఁడు గరంబబ్బురమొదవం
జేరఁగ నతిమృదుమధురము, ధారసధారలుస్రవింప దానిట్లనియె. ౧౦౯

గీ, ఉవిదమును నీవు మొసలివై యుండియిపుడు, లలితసౌందర్యవతివై విలాసలీల
నుండుటకుగారణంబేమి యున్న తెఱఁగు, తేటతెల్లంబుగామాకుఁ దెలుపవలయు.

క. అనవుండదడి యిట్లనుచిను, మునఘాయేనంద యనెడు నప్సరసౌనన్
ధనదునకు ననుంగ నాసఖు, లనుపమగుణయుతులు నలువురలనుదురిమ్మిన్. ౧౦౧

గీ. వారలలితసమీచియు వంగసౌర, భేయి యనెడు సఖిఖ్యల వెలయువారు
సారదిమేమేవ్వురము భూమిచూడవచ్చి, కడలికడనొక్క యుబ్రింపు కానగాంచి.

ఉ. కొప్పులుపీడ బాఱనిడి గుబ్బలపైఁటలు జాఱసారెకుం

జిప్పిలి మోముదామరలఁ జెమ్మటబిందువు లూఁగ గోరికం
బుప్పొడి దిప్పలెక్కఁ జను బూవులు గోయుచు దేవిలానుచున్
ముప్పిరిగొన్న వేడుకల ముచ్చటలాడుచుఁ గ్రీడసల్పఁగన్. ౧౦౩

మ. సరసన్ వీవఁ దొడంగె నప్పుడు వనీసంజాత నానాలతా
తరుసంఘాత వినూతనప్రసూనలతాంత ప్రాళికాగమోద మే
దురనిర్యన్మకరంద బిందుమిళదస్తోకాభిరామక్రియా
పరిఖేలన్మలయాచలాగత జగత్ప్రాణాంకుర శ్రేణికల్. ౧౦౪

క. అమ్మగ దంకురములు మే, చెమ్మటలు హరింప సంతసిల్లుచు మే మె
క్కమ్మడిఁ గోకలల, గమ్మవిరుల్ గోయుచుండ గంజనియొకచోన్. ౧౦౫

క. మునియొకఁడు తపముసల్పఁగ, గనియది వెలుపంగఁదలఁచి కచకుచజఘనా
భినవవిలాసము వెలయఁగ, ననుపమగతి మెలఁగ నాతఁడతికోపమునన్. ౧౦౬

క. మకరాకృతిమీజంఘులఁ, బ్రకటంబై యుండుఁగద వికాస్వరలీలన్
సకలాంగంబులు మీకిఁక, మకరాకృతినుండుఁడంచు మదవతులారా. ౧౦౭

గీ. అనుచు శాపంబొసంగ మేమాత్మ బెగడి
విన్నబోవుచు గడు మ్రొక్కి వేఁడుకొనిన
నంతటదయారసాప్లుత స్వాంతుఁడగుచు
నమ్మునీంద్రవతంసమిట్లనుచుఁ బలికె. ౧౦౮

ఉ. ఓపురుహూతనీలనికరోపమ కైశికలార తప్పదీ
శాపము దైవికంబిది విచారమిఁకేటికి మీరలిప్పుడీ
రూపులఁబాసి దక్షిణసరోవర పంచకమధ్యమంబులం
దోపికతో శతాబ్దముల నూనజలగ్రహవృత్తి నుండుఁడీ. ౧౦౯

క. అంతట తీర్థాచరణ, స్వాంతుండర్జునుఁడు వచ్చి సత్వరమునశా
పాంతము గావించునను మీ, కెంతయు నిజరూపరేఖ లెనయుంజుండీ. ౧౧౦

గీ. అనిపచింప నియ్యకొని నీదురాకఁ గాం, క్షించుకొనుచు నిందుఁ జేరి మొసలి
రూపులూని క్రమ్మరుచునుంటి మిప్పుడిటు, మామకీనభాగ్య మహిమఫలన. ౧౧౧

క. నినుఁగనుఁగొంటిమి నేఁ జే, సినపుణ్యము చక్కనయ్యె శీఘ్రంబున ద
క్కినతీర్థంబులఁ గలనా, యనుఁగుల రక్షించి కావుమని వేఁడుటయున్. ౧౧౨

క. వనితీర్థచతుష్టయమున, మునుఁగుచు దనుబట్టుకొనెడు మొసళులనాల్గిం
టినిబట్టి బైటవేసిన, ననిమిషగానితాలవామ లైవారెలమిన్. ౧౧౩

గీ. ఓమహానుభావ నీమూర్తిఁ గాంచుట, వలన మా కుకస్తి దొలఁగెఁ ద్రొంటి

రూపులూనగలిగె నీహారుషంబు వ, ర్ణింపదరమె యన్నిలింపులకును,

మ. చిరసామ్రాజ్యరమా ధురంధరుఁడవై సింహాసనాధ్యాసివై ౧౧
పరమానంద మనస్సరోరుహుఁడవై ప్రఖ్యాతసత్కీర్తివై
యరిహృద్భీకర బాహువిక్రముఁడవై యాకల్పసంస్థాయివై
వరవర్ధిల్లుము పాండవాన్వయమణీ ధాత్రీధవగ్రామణీ.

సీ. అనుచుదీవించి యచ్చరలమరపుర
హేమరత్నవిమానంబు నెక్కిచనిరి
కవ్వడియునందు వెలుడిగోకర్ణశంభు
మూర్తిఁ దర్శించి సద్భక్తి మ్రొక్కులొసఁగి. ౧౦౪

గీ. భాసమానగతిఁ బ్రభాసతీర్థంబున
కరిగియందువిహిత గతినిదావ
ధర్మములనుస్నాన తర్పణాదికము గా
వించుకొనుచు సాధువృత్తినుండె, ౧౦౫

క. అని శౌనకాదిమునులకు, ననఘస్వాంతుఁడగు రోమహర్షణి వినిపిం
చినవిని యవ్వలికథయును, వినుపింపుమటంచు దవిలి వేఁడుకొనుచుండెన్. ౧౦౬

మ. కవివిద్వజ్జన గేయ సాధుహిత భక్తత్రాణ ధౌరేయ వా
సవనీలోపమ కాయ సంతతజగత్సంరక్షణోపాయభూ
దివిజానీక విధేయ శీతల ధరిత్రీభృత్సుతాధ్యేయ దా
నవదర్పీకర వైనతేయ తృషితామ్నాయా జగన్నాయకా. ౧౩౦

క. మీనకమఠకిటినరపం, చాననవటురామ రఘుప హరిజనయవన
ప్రాణాపహారకాదిక, నానాదివ్యావతార నతమందారా. ౧౩౧

మాలినీ. అగణితగుణసారా హాటకాహార్యధీరా
జగదవనవిచారా సంభృతాజాండభారా
నిగమనుతవిహారా నిర్జితారాతివీరా
దిగధిప పరివారా దీనతాధ్వాంతసూరా. ౧౩౩

గద్య. ఇది శ్రీమజ్జగన్నాథ దేవదివ్య కృపానిరీక్షణ సంలబ్దసారకవితా విచిత్ర కౌం
డిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్య పుత్ర సకలవిద్వజ్జనవి
ధేయ జగన్నాథనామధేయ ప్రణీతంబైన సుభద్రాపరిణయంబను
శృంగారరసప్రబంధమునందు తృతీయాశ్వాసము

---

క. జాతులు కదుములు మొల్లలు, కేతకులిందిరి ప్రసవములు గిరిమల్లికలుఁ
నూతనలీలలఁ బూచిన, నీతలమున కెల్లనొరపు నెరపుచునుండెన్. ౨౯

గీ. అవనిరత్నగర్భయను పేరుదనకును, గలుగుటెల్లరకును గానఁ జేయఁ
దమ్మికెంపుగములు దాల్చెఁ బైననింద్ర, గోపపంక్తులను గొరలెనపుడు. ౩౦

వ. అట్టి వర్షావసరంబున సర్వసుంకా రైవతకాచలస్థానంబున వసియించి యుండెనంత నక్కడ. ౩౧

క. శ్రితపరిపాలన శీలుఁడు, నతులిత కరుణాలవాలుఁడగు హరి నైజా
యతనమున కరిగి మాయా, యతినర్జును నటకుఁదేఁ బ్రయత్నము చేసెన్. ౩౨

చ. పెరిగడలఁ బెద్దలం బిలిచి పెల్లుగ రైవతకాచలోత్సవం
బొగినొనరింపఁ గావలయు నూళ్లను బ్రోళ్లు నగళ్లు గుళ్లుబా
గుగఁగయిసేయఁ బంపుఁడని గోపవధూప్రియుఁ డాగతియ్యెఁద
జ్జగతిజనుల్ రయంబసరసక్రియ నట్లొనరించి యంతటన్. ౩౩

గీ. కప్పురమునుంచి గంధము కస్తురియును, గందవొడియును చాందుపాంకవము మొదలు
పరిమళద్రవ్యములు మరిబహుసువస్తు, జాలములు గూర్చిపురుషులు జలజముఖులు. ౩౪

క. నానామణి భూషణములు, చీనాంబరములు ధరించి చెలువలరంగా
నానగముఁ జూడవెన్నుని, యానగముకు గూడిచనిరి హర్షము జెసఁగన్. ౩౫

సీ. సాంబసాత్యకి హలిశంబ రాహితగద ప్రముఖులు తమతమ పసిడితేరు
లెక్కి వధూటీ సమేతులై శృంగారవేషముల్ రాణింప వెదలి చనిరి
కరులశ్వములు శతాంగములు భటుల్ నటుల్ గణికానికాయంబులు గదసికొలువ
భోజకన్యకయు సాత్రాజితి మొదలగు పట్టంపుదేవులు పదియునారు
వేలదివ్యాంగనామణులు ప్రోలఁబసిఁడి, యందలము లెక్కి యరుగ సమగ్రవైభ
వాభిశోభితుఁడగుచు మురాంతకుండు, చనియె రైవతాకాచలోత్సవ మొనర్ప. ౩౬

ఉ. చిత్తరువారిత జీనిపని చీరకటిన్ ఘటియించి క్రొత్తను
స్తత్తపుతాపితా రవికె గుబ్బల నుబ్బలరారఁ దాల్చిమె
ల్పత్తడి మానికంపుతొడవుల్ మెయిఁబూని సుభద్ర యేగెలో
హత్తినవేడ్కఁ గుందనపు టుందల మెక్కి చెలుల్ భజింపఁగన్. ౩౭

గీ. అట్టులరిగి యమ్మహాన్నగేంద్రము చేరి శౌరిపతులుదాము సంతసమున
నచట సర్వపూజ లారాధి నొనరించి, యుచితలీలఁ జెలఁగుచున్న యెడల. ౩౮

క. భద్రేభరాజయానసు, భద్రయుఃదవమానసమునఁ బార్థుఁడు బతిగా
భద్రగతిఁ గోరుకొనియ, య్యాద్రీంద్రంబునకుఁ బూజలర్మిలిఁ జేసెన్. ౩౯

గీ. చేసియుల్లాస లీల నెచ్చెలులఁగూడి, యమ్మహాహార్యమణి కందరాగ్రసీమ
హాళిఁగ్రీడించు నజ్జవరాలిఁ జూచియతులితామోద హృదయుఁడై యర్జునుండు, ౪౦

గీ. ఘోరసౌర పారసాత్త్వుల పలుకంబు, గరుడభుజగ యక్షఖచరరాజ
ముఖులసోయగంబుమును గొనిపొగడని, బ్బాల కాలిగోరు బోలఁగలదె. ౪౧

గీ. మున్ను వీనుల విందుగా విన్నదియును, గన్నులారంగ నిపుడు గన్గొన్నదియును
నెన్ననొక చందమైమది కెలమిఁగూర్పఁ, గలిగెఁబో దీనిఁ జూచు భాగ్యంబు నేఁడు.

సీ. వెలవెలఁబోవును విచ్చి పాటకయున్నఁ గెందమ్మి పలుమారు గుందకున్న
జారిపారి బిగదప్పి పొరలుడుల్పకయున్నఁ బంకారుమడుగులఁ బడకయున్న
రాపుఁబడి వన్నెరాకుఁ జెందకయున్న జతవీడి కడలకు జరగకున్న
నీరసపద్ధతి నెటఁ జట్టువడకున్నఁ గాశ్చర్యదశములు గాకయున్న
ఘనసుధాకర కళికా వనజకటక, చక్రిపంకజరాగిక సలముల
దాంగి కదపదనోయ నేత్రాంగకుచర, దాంశుకాంఘ్రులతోడ సాటియగునె యీమె, ౪౩

గీ. అర్ధచంద్రుఁబోలు నలికంబునలినలి, కరిబులను జయించుఁ గచగుచ్ఛమ్ము
లజ్జరాగ సదృశ మధరముధరముతో, నెనజఘనము ఘనము వనిత యుదరము. ౪౪

క. నీలంబుల రోలంబపు, నీలాంబుదఖంజరీటనిభిడ తమస్సు
వాలంబుల చమరీవ్రాగ, వాలంబుల నేలఁ జాలు వనితకచంబుల్. ౪౫

సీ. కందుచేనురసిలాకా చంద్రబింబంబు త్రాసంబుగనని సాన దమ్మికెంపు
రాపులఁబడని తోరపు మించుటద్దంబు రామిఁ జెందని బంగరపు సలాక
కరడుగట్టని గట్టికట్టాణి ముత్తెంబు మెఱసి వెన్కకుఁ బోనిమించు దీవ
కంటకావృతిలేని కన్నెగేదఁగి పువ్వు కసటివిడ్డజవాది కాకరంద
మారయ గంధగజరాజ యానచెలువు, మెండుకొని తద్దఁ గన్నుల పండువయ్యె
దీనిఁగవఁగూడి సౌఖ్యాబ్ధి దేలియాడు, కడిఁది భాగ్యంబు నాకింకఁ గలుగునేమొ. ౪౬

గీ. అనితలఁచుచున్నయెడఁ బ్రియంబాడి దేవ, తామహోత్సవ మొనరించి తరలిచనుచు
ప్రోలఁగను పట్టుశాంబరీముని వరేణ్యు, గాంచి నిక్కంపుమౌనియకాదరించి. ౪౭

క. వందనము చేసి స్వామీ, యెందుండి డిగ్గిరిక్కి మీరలేతెంచితిరీ
చందంబంతయు వీనుల, విందుగ మాకెఱుఁగఁ జెప్ప వేయనతఁడుం. ౪౮

క. సేతుహిమాచల మధ్యా, వ్రీతలమునఁ గల్గు పుణ్యవిపినవిసం
ఘాతములు దేవతాస్థలు, లాతతగతిఁ జూచుకొనుచు నానందమునన్. ౪౯

గీ. వచ్చివచ్చి పుణ్యావర్తనంబై యొప్పు, నిమ్మహీధరేంద్ర మెక్కియిచటి
వింతలెల్లఁ గలయ వీక్షింపఁ యతినిష్ఠ, నిలుపుమందుఁ దపము సాధుగతిని. ౫౦

క. అనుడు నపుడా హలాయుధుఁ, డనురాగము మదిని జెలఁగ హరిఁ గన్గొనియు
ట్లనునీ యతివరుఁడో డ్యాని, ఘనపూజింపఁ జనఁగవలె సముచితభక్తిన్. ౫౧

క. వీరుమహాత్ములు విమలా, చారులు నిశ్చలగుణ ప్రచారులు వీరిం
గోరిభజించిన వారికి, సారమహాపుణ్యఫలము సమకూరుఁ జుమీ. ౫౨

క. మననగరున కీయతిఁడో, డ్యాని చనియుద్యానవాటిఁ గొనుగకయిడినే
ద్యునఁ బరిచర్యయొనర్పఁగఁ, బనుపుమజస్రంబు మనసుభద్రనటన్నన్. ౫౩

క. భాస్కరనిభుఁడగు కుహనా, మస్కరికి నమస్కరించి మహితకృపాచే
తస్కుఁడగు నానవోద్ధృత, తస్కషుఁడు నితాంత సంమదంబునఁ బలికెన్. ౫౪

క. ఓతాపసేంద్ర కులజై, వాత్సక మామనివి వినియవశ్యంబుగనీ
చాతుర్మాస్యము మాపురిఁ, జేతోమోదంబుతో వసింపఁగవలయున్. ౫౫

క. అనుచు గదాగ్రజుఁ డాడిన, విని కపటతపోధనుండు వినయంబునన
ప్పనికియ్యకొనిన నాతనిఁ, గనకరథారూఢుఁ జేసి గౌరవమెసఁగన్. ౫౬

గీ. ఆప్తబలయుతులై యంతహలియు హరియు, సరభసంబున ద్వారకాపురముఁ జేరి
సుందరాత్మీయ కేళికామందిరాంగ, ణాగ్రపుష్పిత లీలావనాంతరమున. ౫౭

మ. వలిఁగ ప్రంపుటనంటి బోఁదియ ప్రకేవన్ మేటిపన్నీటి చాఁ
కలహాంతన్ సురహొన్న గున్నల దరిన్ గాటంపు వాటంపు వె
న్నెల రాచాలయముంగు రంగుల నెరిన్ విప్పారు నెప్పారుటా
కుల మేల్పొంగడు మేడలో యతిశశాంకున్నిల్పి మోదంబునన్. ౫౮

గీ. రాముడప్పుడు తద్దయుఁ బ్రేమతోసు, భద్రరావించియయ్యతిప్రవరునకును
పర్యలొనరింపుచుండుము ప్రతిదినంబు, భద్రమగునీకు సంశయింపంగవలదు. ౫౯

క. ధన్యులు త్రిజగన్మాన్యులు, సన్న్యాసులు వీరిసేవ సలుపఁగ భువిలోఁ
గన్యలకు చితముగావున, నన్యవిచారంబు మాని యరయుము చెలియా. ౬౦

క. అని నిజసోదరి నిటువలెఁ, బనిగొనపి బలుండు ప్రబలబలయుతుఁడైచ
య్యాన నంతర్ద్వీపమునకుఁ, జనియె శివోత్సవ మొనర్ప సంరంభమునన్. ౬౦

గీ. అపుడు కృష్ణుఁడు భోజాత్మజాది సతుల, మంతనంబునఁ గనిపల్కె మనకడాని
బంగరపుబొమ్మయైన సుభద్రఁగోరి, యర్జునుండిట్లు సన్న్యాసియైనవాఁడు. ౬౧

గీ. ఇతఁడు గవ్వడియని మదినెఱిఁగి సేవ, చేయఁబోక సుభద్ర లజ్జించియున్న
నోదనాదికమిడి యరయుడు గాని, కొదికిమీరెల్ల నూరకుండెదరు సుండి. ౬౨

క. అనిచెప్పి నీరిపిలుఁదనె, చనెహరియున్ రుక్మిణియును సత్యయు నరుని
గని యున్నసోదములపై, నెవున్నదె నీకుమదినినిండా రంగన్. ౬౩

గీ. భద్రగజయానయైన సుభద్రఁ గోరి, భద్రవేషంబు మాని యిప్పగిదిఁ గాసి
కోర్చి యతివైతి వాయన్న నోర్చి మీఁద, ననుచు లోలోనఁ గుసగుసలాడి చనిరి. ౬౫

గీ. అంత సుభద్రఁ గృతిప్రియయతివరునకు, సేవ గావించుకొ యనునెచ్చెలులు కొంద
ఱలమి వెంబడించునుఁ గేర నిరవుఁ దెలిపి, సదమలామోద మేదురస్వాంతయగుచు. ౬౬

సీ. చిలుఁగుచందురుకావి జీబుపావడరుచుల్ సరిగంచువలువపైఁ జౌకళింపఁ
గడితంపు మగరాలకమ్మల జగడాలు చెక్కుటద్దంబులఁ జిందులాడ
మురిపించు హురుమంజి ముత్యాలచేర్చుక్క ఫాలాగ్రసీమ సుయ్యాలలూఁగ
కులుకుసిబ్బెపు గుబ్బిగుబ్బలపై తాణి బెడఁగు కంచెలపైని బిక్కటిల్లఁ
గనకకంకణ ఝణఝణత్కారములును నలఁతి మొలనూలి గంటలు నందియలును
గ్రిందుసేయంగఁ గలపంపు కమ్మతావు, లెయ్యెడలఁ బర్వ వచ్చె మునీంద్రుకడకు. ౬౭

గీ. అట్లు వచ్చిన నవమోహనాంగి దవ్వు, దవ్వుల నెచూచి తలవంచి దంభమౌని
పలుకరించక జపము నెపంబు వెట్టి, కన్నుమొగిచియున్నఁ గాంచి యక్కలికిమిన్న. ౬౮

గీ. వినయమునఁ జేరి నతులఁ గావించి కొంత, సేపు ముంగల నిలచి యో తాపసేంద్ర
దేవతార్చనకిప్పుడు తెత్తునాల, తాంతఫల పత్రగంధ జలాదికములు. ౬౯

కం. అనవుడు నాతం డటువలె, నొనరింపు మటంచు దంభ మొదవఁగఁ జేసూ
పిన నాసీమంతవతీ, జనరత్నం బాత్మలోన సంతస మెసఁగన్. ౭౦

సీ. తనమోవి విరచియిట్టి దని తెల్ప వైఖరి మాధురీ సహితసేవ్య ఫలములు
తనమేనిమృదుత్వ మిట్టిదని చూపుపోలికెఁ గోమలామల దివ్యకుసుమములును
తనగుబ్బలిటువంటి వనిచాటు వడువున సుకరనవీనాబ్జ ముకుళములును
తనపల్కులిటువంటి వనియెఱుంగఁగఁ జేయు కైవడిఁ గర్పూరఖండములును
తెచ్చియందిచ్చె రత్నదేదీప్యమాన, కనకకంకణ ఝణఝణత్కార రవము
లింపుఁ దళుకొత్తఁ గపటయోగీంద్రు నరుని, చకితసారంగశాబకచారునయన. ౭౧

కం. అటువలె నందిచ్చిన నక్కుటిలాలక ముఖకపోలకుచకచజఘన
స్ఫుటవిభ్రమములఁ జూచుచు, నటునిటు, దడబడఁగ దేవతార్చనఁ జేసెన్. ౭౨

సీ. చెలిమోము దమ్మితావులు సుగంధము గాఁగ బోఁటినవ్వులు మల్లెపూలు గాఁగ
మదవతినున్నని పెదవి చక్కెర గాఁగఁ గలకంఠిగళము శంఖంబు గాఁగఁ
గలికి చన్గవ హేమకలశద్వయము గాఁగ సతితళుక్కు చూపు లారతులు గాఁగ
భామకేశౌఘ ధూపధూమాంకురము గాఁగఁ రమణిపాణులు పల్లవములు గాఁగఁ
దలఁచి హృత్పద్మకర్ణికాంతరమునందుఁ, బుష్పసాయక దేవతా పూజ సేసె
బాలికాకేళికా మహాఫలము గోరి, యలిమనంబున శాంబరీయతివరుండు. ౭౩

క. అతులిత భయభక్తి సను, స్ఫీతమతిన య్యతివరునకు నేర్పొదవ నమును
వ్రతవేణి రసిరన్నము, లతి మోదంబొదవఁ దెచ్చి యటవడ్డించెన్. ౨౪

చ. అలికులవేణి యిట్లొసఁగునట్టి ఘృతప్లుత భక్ష్యభోజ్యముల్
కలయఁగఁ జూచుచుండుటయె కాని యొకింత భుజింపనొల్లఁడా
కులుకుమిటారి వెడబపు గుత్తపుఁ గంచెలలో వెలుంగున
గ్గలపు బెడంగు గుబ్బగవ గాంచు పరాకున వాతఁ డెంతయున్. ౨౫

క. చేరికతోఁ బ్రేమమిల్లఁగ, గోరికదీరంగ భిక్షగొనుఁడని యనిరన్
నారాయణయని పలుకన్, గారుడపుంచబిసమిన్న గారవమెసఁగన్. ౨౬

గీ. అట్లు భక్తితోడ ప్రాంజలియై మేఁ, మున్న కన్నెఁ జూచి యున్నరుఁడు
చిత్రజాతచాత్రశిత శిలీముఖపాత, ఘాతమాన సాంబు జాతుఁడగుచు. ౨౭

క. నందాదిక బృందారక, సుందరులన్ ముంచుదరిసి చూడ మెహారి
యింద్రముఖింబోల నేర్తురె, సౌందర్య కళావిలాస చాతుర్యములన్. ౨౮

చ. పలుకులు తేనెజాలు, మెఱుపైఁడి సలాకును బోలు. వాలుఁజూ
పులు వలిగండుమీలు, కనుబొమ్మలు మారుని విండ్లనేలు, గు
బ్బలు బలుబొంగరాలు, కచపాళి ఘనాఘనలీలఁ గ్రాలు, నీ
చిలుకల కొల్కి మేలు వగ చిత్తము తత్తరమొందఁ జేసెనే! ౨౯

చ. బలు గుజరాతి కెంపు జిగి బాపెడు నెఱ్ఱని నును గావిమోవి, క్రొ
దళుకులు నింపు నించు విలుదంటచొకాటపు మించు టద్దపుం
బలుకులు చెక్కుటద్దములు బంగరు రంగు గనంగఁ జేయు మే
ల్గలిగిన దీనిఁ గూడక సుఖంబెదఁ జేరును తాప మారునే. ౩౦

చ. అని మదిలోఁ దలంచుఁ జెలియానన పద్మ మొగంది గంగనుం
గొని తలవంచు నించు మతిగుప్పున పైఁ బరగించు నించువి
ల్తుని విరితూపు సోకులకుఁ దూలుచుఁ జాలఁ జలించుఁ దద్వినూ
తన తనుహావభావ లలితంబులు సారెకు సెంచు మించఁగన్, ౩౧

సీ. గాత్రివోపమస్తని గంధసారము దెమ్ము ఘనవేణి మధురోదకమ్ము దెమ్ము
చక్కెరబొమ్మ యచ్చపు పానకము దెమ్ము లత కూనకుసుమవల్లరులు దెమ్ము
చంద్రాస్యనీహార సలిల పూరము దెమ్ము కొమ్మ సారఫలోత్తరమ్ము దెమ్ము
రంభోరు కాండకప్రింపు బల్కులు దెమ్ము సారంగనయన కస్తూరి దెమ్ము
నేళ దప్పక యుండనే వేగవతను, దేవతాపూజ సక్రియ దీర్ఘవలయు
ననుచు మఱి వరిఁ దెచ్చిన యువిదయె తేరఁ, బనుచుఁ జెలి విభ్రమములు వన్నొసఁగఁ గోరి

క. కొమ్మావలిజెక్కులుఁగవు, రమ్మారమ్మాథరాపరాగంబని తాం
దమ్మున నించుక భ్రమసెతి, జుమ్మాయని కెలనంటెఁ జొక్కుచునుండన్. ౭౩

చ. మినుకుకడానిబంగరవు మేల్ రవణంబులు చల్వవల్వయున్
నునుఁగపురంపువీడ్యములు నూత్నమృగీమదగంధచర్చలున్
దినమొకవింతగా మదవతీమణి దిద్దుకయొద్ద నిల్వఁగ
న్గొనియొనలేనికూర్మి నృపకుంజరుఁ డెంతయుఁ బత్తరింపుచున్. ౭౪

మ. బలిమింగాఁగిటఁ బట్టఁగాఁదివురుఁ గోపంబూని కాదంచు రం
తులు గావించి పెనంగినన్ సఖులు దోడ్తో రవ్వ గావింతురి
క్కలకంఠీమణి చిత్తవృత్తి దెలియంగా రాదు నే నెట్టులీ
వలవంతం దుదముట్టువాఁడననిలో వాపోవిచింతింపుచున్. ౭౫

వ. అత్తెఱంగున బ్రత్యహంబు నత్తలోదరి హత్తి సేవ గావింపుచున్న నన్నరేంద్రచం
ద్రుండు దానింగవఁగూడు కోరిక లీరికలెత్త నెప్పుడెప్పుడని తమకింపుచున్నయెడ
నంతనొక్కనాఁడు. ౭౬

గీ. నరునిరూపగరిమ నరులెన్న మునువిందు, నట్టి వేషమితని యందుఁదోచె
నతఁడు రాజు భిక్షుఁడగు టెట్లొకరిఁబోల, నొకరు లేరె మనుజు లుర్విలోన. ౭౭

క. అనిసంశయ మించుకయును, మనమున నిడగా సుభద్రమాయామౌనీం
ద్రుని కప్పటివలె వర్చన, లొనరింపుచుఁ జెంతనొంటి నున్నట్టియెడన్. ౭౮

శా. భావప్రోద్భవ వీరపుంగవుఁడు శుంభద్భంభరాలంకృత
జ్యావల్లీభయదార్భటుల్ నిగుడ మాత్సర్యంబవార్యంబుగా
నావివ్వచ్చుని డాసి యేసెఁ గడుఁ బ్రత్యాలీఢపాదస్థుఁడై
పూవుందూపులు పింజపింజగరువం బుండ్రేక్షుచాపంబునన్. ౭౯

క. అటువేయ సోలియతఁడ, క్కుటిలాలకఁ జూచి ముద్దుకోమలినీకిం
తటిలోనఁ బెండ్లిగాఁగల, దెటులన్నను దత్ప్రకార మిపుడెఱిఁగింతున్. ౮౦

క. రాజమరాళము నీపద, రాజీవముఁ దొక్కి నిలిచె రాజద్గతినీ
రాజశుకము కేల్వట్టెను, రాజానన యివి వివాహరతిసూచకముల్. ౮౧

గీ. అనిన లజ్జాను మోదంబు లినుమడింప, మొకమొకించుక వంచియమ్ముద్దుగుమ్మ
మేటిపగడంపు కంబంబుమాటు జేరి, యలఁతి తెలినవ్వు దళుకొత్త నిలిచియుండె. ౮౨

గీ. నిలిచి వీరుమహాత్ములు నేనొనర్చు, సేవకలరారి యిట్టులాశీర్వదించి
పలికిరని సంతసిల్లి యక్కలికిమిన్న, చిఱునగవు నెమ్మొగమ్మునఁ జెంగలింప. ౮౩

గీ. గుత్తపుమిటారిగుబ్బల నొత్తగిలిన, యుత్తరీయంబు చక్కఁగ హత్తుకొలిపి

బెళఁగు కెంపులము క్కెఱ పెదవిబోదల, నలఁతిపలుకులఁ జేనియల్ చిలుకఁబలికె.

ఉ. ఓయతిచంద్ర వీరుఁ గనఁగొందు నదీనగరిప్రసిద్ధ దే
వాయతనంబులుం గలవె యారయ నివ్వసుధాతలంబునం
దేయెడనైన భారతకులేంద్రుని నర్జునుఁ జూచినారె మీ
రాయత సత్కృపాకరి వనంతయు నాకెఱుఁగంగఁ దెల్పరే. ౯౫

సీ. ఇంద్రనీలప్రభాలు నేలుచామనచాయ మేనువాఁడలఁతిలేఁ గౌనువాఁడు
కొదమతుమ్మెదగమి నదలించు సోగపెన్నెరులవాఁడొరపు ముత్తరులవాఁడు
మఱియుఁ బున్నమచందమామ నెగ్గులువల్కు మొగమువాఁడరిది సోయగమువాఁడు
తమ్మిఱేకులఁ గెల్వఁ దమకించు నేత్రయుగమ్మువాఁడు వెడందఱొమ్మువాఁడు
దంబుగలవాఁడు బవరిగడ్డంబువాఁడు, కంబునీకాశరుచిర గళంబువాఁడు
నాఁడు మేనత్తకొమరుండు నా కవిభుఁడు, మాఱుఁడర్జునుఁ డభినవమారుఁడతఁడు. ౯౬

గీ. అరయ నొక్కబ్దమునఁ బూన్యేఁ దీర్థాచరణము, సలుపఁ జనుదెంచె నందందసంచరించి
మగలఁ జనుదెడ నిష్ఠురమార్గమునను, వచ్చునో లేక యాత్రలోన వట్టిచనునొ. ౯౭

క. అనుదినమతఁడే మేమ్మి, ననునడిగెద వాసురేంద్ర నందను పైనీ
కనురాగమింత గలదో, యనుమానము మాని తెలియ ననుమానవతీ. ౯౮

క. గోకర్ణక్షేత్రంబున, గోకర్ణాభరణుఁ శివునిఁ గొలుచుచుఁ గొన్నా
ళ్లేకతము నే నతఁడు, నేకగ్రీవముగ నుంటి మిభనిభగమనా. ౯౯

మ. అతులానందమునన్ సమస్తకరుబంధానంత పుణ్యప్రదా
యతదేవాయతనంబులున్ గిరులరణ్యంబుల్ నదుల్ తీర్థముల్
ప్రతినిష్ఠన్ భజియించుకొంచు నుచితవ్యాపారమేపారఁగా
నతఁడేమేము యున్నవారము సుమీ యంభోజపత్రేక్షణా. ౧౦౦

క. ఆయర్జునుఁడీచాయను, మాయామునివేషమూని మలయుచునున్నా
డీయిక్కువ నీవెఱుఁగవు, గాయొక్కంతయిన మత్తకరివరయానా. ౧౦౧

గీ. ఛలియు యతఁడర్జునుండని తెలిసినపుడె, నాన డెందంబులోనఁ బెనంగొనంగ
నివటనిలువక మాటాడ కేచటుఁ జుడిగి, చనియెదోయని సంశయంబెనయు జుమ్మి,

వ. అని మఱియు సైరింపరాని మోహాయత్తచిత్తంబునం దత్తరింపుచు నిట్లనియె,

క. నీకై వట్టుటకై నే, నీకైతవమాని నైతి నేనర్జునుఁడన్
నాకోర్కె దీర్పుమిప్పుడు, నాకోపమ తనువిలగ్న నాళీకముఖీ. ౧౦౨

ఉ. ఉన్నటునాటనుండియును జేపియనీదగు చెల్మిగొంచు నే
నన్నలఁ దమ్ములం బ్రజల నంకఁబికల్కఁగు వెట్టియొంటినీ

గన్నులఁజూచు వేడ్క నిటు కైతవ వేషముఁబూని వచ్చితిన్
నన్నక సన్న నీబిగువు చన్నులనొత్తి కవుంగిలింపవే. ౧౦౫

చ. అతనరీతి యెల్లఁ దెలియన్వచియించి కవుంగిలింపఁగా
ర్కొను నెడనాతి యాతని నరుండని కొంత యెఱింగియుంగటా
మునియని సేవచేసి కడు మోసముఁబొందితి నెల్లరూ నినీ
జనములలోన నేను పలుచందములన్నగు బాటుఁజెందితిన్. ౧౦౬

ఉ. ఇప్పటిగాదు పొమ్మనిన నీతనిచిత్తము నొచ్చువీఁడటం
దప్పియినమ్మ నియ్యకొని తత్పరతంబయికొన్నఁ బెద్దలే
చొప్పున నెంతురో మదికిఁ జొప్పడదేమియు నంచు నిగ్గునన్
గుప్పున లేచిపోవు నెడఁ గొమ్మకరాబ్జము పట్టె గ్రీడియున్. ౧౦౭

క. పట్టిన యంత నెచ్చెలికటి, పట్టునఁగట్టిన మెఱుఁగు పట్టవలువ చెం
గట్టిట్టుఁ గొలఁగె మొగమున, బిట్టుగ బెట్టిన పుజెమట వెట్టిం బెలుచన్. ౧౦౮

చ. సడలి వెడంద సెందురుము ఝల్లున వీఁడె నొడల్పడిన్ గగు
ర్పొడిచె నెటందిగుల్ గదిరెఁ బోవఁగఁ బోనటుఁ గుల్కుఁ సుందరం
బడవలి గబ్బిగుబ్బచను బంతులమీఁది మెఱుంగుతాపితా
గడితవు నీటుకంచెల నకావక పైపికి లేదటాలునన్. ౧౦౯

చ. అపుడు రమాకుమారుఁడు మహోగ్రహజాగ్రదుదగ్ర పుష్పలి
ద్విపులగుణారవావిరత విస్ఫురదిక్షు శరాసనంబునం
దపరిమిత ప్రసూన విశిఖావళులుద్ధతి బూంచి యేసెనా
చపలవిలోచనామణిని శక్రతనూజుని జెందు బెండుగన్. ౧౧౦

క. ఈరీతి నేయునతఁడా, నారీతిలకంబుఁజూచి నలినానన నా
కోరిక దీర్పక యూరక, గారుసి మొనరించిపోవఁగా నుచితంబే. ౧౧౧

గీ. చిన్ననాటనుండి మున్ను నిన్నే నను, నన్ను నీవుఁజూచి నాయుగాము
వినికివలనఁ గూర్మి జనియించె మనకిర్వు, రకును బ్రకటమొప్ప ముకురవదన. ౧౧౨

క. కావున మనకిర్వురకును, దైవవశంబుననునేఁడు దార్కొనగలిగెన్
నీవేల జుడిగిపోయెద, వీవేళ మదీయవాంఛ లీడేర్పఁగదే. ౧౧౩

క. వింతనుగాను గదానీ, వింతనె విడనాడిపోవ నింతీ వలిపూ
బంతీ సొగసులదొంతీ, కంతునిదంతీ సమస్తకళలవలంతీ. ౧౧౪

క. మేనత్త కొమరుఁడను నా, మేనత్తఁగ మేను జేర్చి మెఱుఁగారెదు నీ
మానికపు మేనిపాలిక, మానికపుంగటసఖించు నటులోనరుపుమా. ౧౧౫

క. బాలాబాలా లోలాలో, త్రాలాలకజాలచాల తాళింజాలన్
జాలంబేలా బేలా, హేలాగతి రతులదేల్చి యేలుమునన్నున్. ౧౧౭

చ. కలకలనవ్వవేమి పగఁ గ్రోలఁగఁ గౌఁగిటఁ గూర్పవేమి యిం
పలరఁగఁ బల్కవేమి యధరామృతమానఁగ నియ్యవేమి నేఁ
బిలిచిన రావదేమి నను బిత్తరిచూపులఁ జూడవేమి హా
చిలుకలకొల్కి యిట్టులన జేయఁగ నేనొకలాఁతివాఁడనే. ౧౧౮

క. అంధుఁడు కైరవిణీవన, బంధునిరూపింపలేని పగిదిన్ రతి సం
బంధసుఖమెఱుంగ కలికెను, గాంధర్వవివాహకేళిఁ గలయుమనన్నన్ ౧౧౯

గీ. అనుచుఁ బెనచుతమినిఁ దనుజాలఁ బ్రార్థింప, మగువ మొగము వంచి మారువలుక
కున్న దానిచేత నొరసారముద్దులు, చిలుకఁ బలుకు వలఁతి చిలుకఁ బలికె. ౧౨౦

ఉ. నావలవంత పేర్చ్చులలనావల నారటించుఁ గోరి నే
వేవిధులన్ వగందగిలి వేఁడిన మోము ముడించి మౌన ము
ద్రావిధిఁ బూను మీ చెలియ దానిననుంగదియంగఁ గూర్పు మా
కేవలతుండకాంతి జితకింశుకమా శుకమా ప్రియంబునన్. ౧౨౧

క. అని రాజశుకముఁ బలికిన, విని రాజనిభాస్య దాని వీక్షించి కడున్
వినయము వలంతితనమును, నెనయఁగ నంబడగ సాధునియతిం బలికెన్. ౧౨౨

క. నాయము గానుగదా నర, నాయకులకుఁ గట్టిపనులు ననుదనకు వెసన్
మాయన్నలు తలిదండ్రులు, జేయుదురు వివాహమనుచుఁ జెప్పుము చిలుకా, ౧౨౩

ఉ. నావుడఁ దండు తత్తరముఁ జెలికెట్లను నీవు పెద్దలే
కైవడిఁ బెండ్లి చేసెదరు గ్రక్కున నెక్కడిమాట యిప్పుడే
కావలెఁ గోరుకొన్న పని కాదని నీవు జూడంగఁ బోయినన్
భావభవప్రసూనశర బాధల నెవ్విధిఁ దాళియుండుదున్. ౧౨౪

గీ. బాలనన్నిట్టు లలయింప నేలమరుని, పూలకోరులవెతలకుఁ దాళఁ జాల
వైళముఁ నన్నుఁ గౌఁగిటఁ గీలుకొలిపి, మేలుదైవార లెంకగా నేలుకొనుము. ౧౨౫

గీ. అనుచుఁ జెందుకొనెడునపుడందియలు మ్రోయ, హంసశాబకంబులరుగుదేరఁ
జెలులు వచ్చిరంచుఁ జేసన్నఁ జూపి కేల్పట్టు దప్పఁద్రోచి పడఁతి పఱచె. ౧౨౬

క. ఈపగిది కింకిణీమణి, నూపురరావములు చెలఁగ నునుఁ గొప్పున పెన్
జూపుల జంకెన లెనయఁగ, నా పూవుంబోడి చనియెనంతః పురికిన్ ౧౨౭

గీ. ఆ... నృపమౌళి కుండె జల్లనఁగ నోలి, నెమ్మొగంబున దైన్యంబు నిప్పటిల్ల
...మ్మలింపుచు బెగ్గిలి యుసురనుచుఁ, గంజముఖిఁ బల్కఁ గద్దన కంటఁ దగుచు న...

క. నిలుపోకు పోకుబాలా, వలచితి నేనీకుఁ జాల వంచనయేలా
చలమెందుఁ బూనుటమేలా, తలిగాకు కటారి కూళఁదలఁపుము బేలా ౧౨౯

క. సెనరొందవనన్నుఁ గౌఁగిటఁ, బెనచి సుఖింపక మొఱంగి బిరబిర నేటకోఁ
జనఁజూచెదహాహా మనుకో, న్ననములు కలపాలఁ జాలనలిగెదవు సుమీ ౧౩౦

క. మగువా పెంచిన చనిప, న్నగభుక్ఛుక శారికలను నమ్మించనకుము
న్నగదైవబలము దప్పినఁ, బగవారై యుంద్రు ప్రాణబంధువులైనన్ ౧౩౧

వ. అని యివ్విధంబున ౧౩౨

క. సాధుగతి నరుఁడు వేఁడిన, నాథవశీక్షణ మొఱంగియటుఁ జనిమదన
వ్యాధాసాధారణశర బాధాగాఢాబ్ధిమునిఁగి పసచెడియుండెన్ ౧౩౩

వ. అని శౌనకాది మహర్షులకు రౌమహర్షణి యుటంగించినవారలని సవ్వలికథా వి
ధానంబెట్లనియడుగుటయును. ౧౩౪

చ. వనజభవాది కాఖిలసుపర్వగణావన విశ్వభావనా
సనకసనందన ప్రముఖసన్ముని రంజన శత్రుభంజనా
ఘనకరుణారసాప్లుత వికస్వరలోచన పాపమోచనా
ప్రణతసుధీజనానిశవిభాస్వదనుగ్రహదాయవిగ్రహా ౧౩౫

క. అవిరతవితతచతుష్షష్ట్యవసర నైవేద్య ఖాదనామోదరథో
త్సవముఖ వివిధోత్సవవైభవ విలసితధామ పతితపావననామా. ౧౩౬

భుజంగప్రయాతము. హరీ దేవతాధ్యక్ష యంభోరుహాక్షా
దరీసర్వలోకేశ దైత్యప్రణాశా
కరీంద్రావనోపాయ కారుణ్యగేయా
ఖురీపస్ఫురత్పాద సమ్యగ్వినోదా. ౧౩౭

గద్య. ఇది శ్రీమజ్జగన్నాయక దేవదివ్య కృపానిరీక్షణ సంలబ్ధసార కవితావిచిత్ర
కౌండిన్యసగోత్ర పవిత్ర కూచిమంచి గంగనామాత్యపుత్ర సకలవిద్వజ్జన
విధేయ జగన్నాథనామధేయ ప్రణీతంబయిన సుభద్రాపరిణ
యంబను శృంగారప్రబంధంబునందుఁ
జతుర్థాశ్వాసము.

D. Kameswara Rao

# సుభద్రాపరిణయము

:o:

## పంచమాశ్వాసము.

క. శ్రీరాజిత నిజసౌధా, గ్రారూఢ మహాసుదర్శనాం చలవీక్షా
దూరీకృత భవబాధా, సారకృపా వేశశీల శైలనివేశా. ౧

వ. అవధరింపుము నైమిశారణ్య మహర్షులకు రోమహర్షణి యిట్లని చెప్పందొడంగె న
ట్లు సుభద్రాభద్రేభగామిని పట్టుదప్పించుకొని యరిగి యంతఃపురంబు ప్రవేశించిన. ౨

గీ. అంతట దురంత చింతనక్కుంతిసుతుఁడు
కంతుకుంతాయితలతాంతకాంతనిష్కు
టాంతరనితాంతకాంతి సంక్రాంతచంద్ర
కాంతమాణిక్య వేదికాంగంబుఁ జేర్చి ౩

చ. ఉసురుసురంచు సొమ్మసిలు నుమ్మలికంబునఁ దల్లడిల్లులోఁ
గసరుకొనున్ దిశల్ వెదకుఁ గన్నులు మూయుఁ బడంకు గగ్గిలుం
దొసఁగులఁ గుందుఁ జాపమునఁ దూపిలు విస్మృతిఁ జెందుఁ గాసిలున్
బసచెడి తూలు జాలిఁ గొను బాపువిధీ యిటు చేసితే యనున్. ౪

చ. మదవతి వచ్చు నంచుఁ బెనుమక్కువఁ గ్రిక్కునఁ జెవుల్ దిశల్
వెదకు విలాపుఁ జెందుఁ బలవించుఁ గనుంగవ నశ్రుబిందువుల్
వదలక చిప్పిలన్ మొగము వంచి కృశించుఁ జలించు హాయనున్
మదనకిరాతశాతసుమమార్గణ నవ్యశరవ్య చిత్తుఁడై. ౫

వ. మరియు నాత్మగతంబున. ౬

ఉ. సన్ననిసోగ పెన్నెరులు నువ్వువిరిన్నగు నాసనిబ్బపుం
జన్నులు ముద్దు నెమ్మొగము సన్నపుకౌను వెడందకల్కివా
ల్గన్నులు తళ్కుచెక్కులు నిగారపుకెందలిరాకుమోవి యుం
గన్నులఁ గట్టినట్లయగుఁ గన్నియ నెన్నఁడుఁ జూడఁగల్గునో. ౭

సీ. చిలుకపటాణి తేజీవజీరుని విరజాజిపూచికి లికైజారుసౌరు
మీసునిద్దా పదమూరు మేల్వన్నె బంగారు సలాకచెంగలువమోక
నిండుపున్నమనాఁటి పండువెన్నెలనిగ్గు మిసుకారుతొలుకారు మెఱుఁగుఁదీగ
కడిఁదివెన్నెత్తావితుంట గన్నెగేఁగి పువ్వుతేట గొజ్జంగిపూసీటికొలఁకు

చెలువచెలువంపు జక్కరల్ చిలుకుబలుకు, తలిరువిలుఁదాల్పు బలువేల్పు కలికిచేతి
కలికిరాచిల్క నెఱమానికమువమాట. దానిఁగవఁగూడకే జాడఁదాళువాఁడ ౮

సీ. చిలుకచిల్కనఁదేనె చిలుకముద్దులుగుల్క చిలుకను బద్ధంబు చెప్పనేర్పు
కరతాళగతులవేసరక మయూరసంఘములకు నాటలుగఱపనేర్పు
మించునెయ్యమున రాయంచ కూటువులకు పేరుగాఁడకలు దిద్దనేర్పు
తనియమేతలు వెట్టి తనరొప్పశారికాసందయంబులఁ బలికింపనేర్పు
చెలిమిచై ర శృంగారకలనమిఁ, జేసి సారకుఁ బరిచర్యసేయనేర్పు
నబ్బురంబొప్ప నబ్బాలకబ్బెనౌర, దానితోఁ బొందునేనెన్నఁబూనియుందు ౯

క. ఆచిన్నిచన్నుగవచెలు, వాఁడుఁనగునోము గోమునాచూపులకో
పాచెక్కుటద్దములపస, నాచిత్తములోన నొకక్షణము బాయదుగా ౧౦

సీ. దానిధమ్మిల్లంబు ధరలీలపర్వక యతనుతాపాగ్ని చల్లారఁగలదె
దానికెమ్మోవి సుధారసంబానక సూనాశుగవ్యాధి మానగలదె
దానిముఖేందు సందర్శనంబొదవక మదనాంధకారంబు వదలగలదె
దానినిర్భరపయోధర దుర్గమబ్బక స్మరబలోగ్ర భయార్తి సడలఁగలదె
దానియశ్రాంత సాంగత్యతరణిలేక, భూరివిరహాంబునిధిఁదాటబారిగలదె
యంచుమదినెంచుఁ దలవంచుసంచలించు, ఘోరమారవికారాప్తిఁగుందికుంది ౧౧

ఉ. నీహారాంశుముఖీ కదంబకమణీ నీ గోరిసన్న్యాసినై
యాహారాదిఃధానముల్ మరచి యత్యంతాను రాగంబుతో
బాహాలింగన సౌఖ్యవాంఛమదిలోఁ బాటిల్లనేనుండుచో
నాహాయిట్లరచేసి యేగితె సుభద్రా భద్రకుంభస్తనీ. ౧౨

శా. రావేచిల్కలకొల్కి రావెలలనా రావే జగన్మోహినీ
రావే పూర్ణసుధాకరో జ్వలముఖీ రావేకురంగేక్షణా
రావేనీలఘనాఘనాభచికురా రావే లతాంగీమణీ
రావే నన్నలయించకే యనుచులో రాగిల్లి పల్కుందమిన్ ౧౩

వ. అనియని వారితమదనోన్మాదంబున లేచి యేచిన తమకంబునచేత నాచేత నజ్ఞానంబు
మరచితరు లతాగుల్మాదులం గనుంగొని. ౧౪

సీ. మవ్వంపునెత్తావి పువ్వుగుత్తులఁజూచి భామగుబ్బలటంచుఁ బట్టఁబోవు
లతికాగ్రయుత మధువ్రతరాజిఁగని బాలనీలవేణి యటంచు నివురఁదివురుఁ
దరుణకంభాస్తంభతతులు నిరీక్షించి చెలువయూరువులంచుఁ జేరఁబొలుఁ

## సుభద్రాపరిణయము.

౬౦ ఘనపవన ప్రియకుహూకారంబులాలించి వెలఁదిరొ యెలుంగని వినఁగఁగోరు
నిరతనిరవద్యనిబిడనిర్నిద్రకాద్ర, మకరకేతనశిఖిశిఖానికరదహ్య
మానమానసుఁడగుచును ధ్యానతరుని, తానములఁ ద్రిమ్మరియు మందహాతహాలునిగుడ. ౧౫

క. నేహాసీకరమువట్టిన, నేహాసీమంతి వతిగణింపకయుంతో
క్రీడనెడఁ బాసియేఁగుచు, నీడానీనీడ వీడకే తేరదుగా ౧౬

క. కాంతాలలామ నాపైఁ, గాంతాళము పూనికాదు కాదనివనినీ
చెంతకురాదుగదా మన, సెంతయుఁగలఁ గంగఁజూచి హింతాళంబా. ౧౭

ఉ. లుంగములార భూమిఫలలోల నితాంతవినమ్రకమ్రినా
రంగములార సారసుమరాజి విరాజిత మల్లికామిళ
ద్భృంగములార శోభపరిస్ఫుట పద్మవనీవిహారచ
క్రాంగములార మీరలు రథాంగకుచన్ గనరేకురంగటన్ ౧౮

క. బాలాకుచమృగమదజలి, బాలారతినేలు మనుచుబతిమాలినన
న్నేలాలతాకుడుంగమా, హేలాగతిపెంగి చూరఁగనేలా చెపుమా. ౧౯

సీ. మీఫలంబుల బోలు మెఱుఁగు గుబ్బల ముద్దుగుమ్మఁ గానరెగజనిమ్మలార
మీ క్రొన్ననలఁ గేరుమిసిమి వాతెర రాచకొమ్మఁ గానరె దానసమ్ములార
మీ తేకులను మించుమించుమగన్నుల పైఁడిబొమ్మఁ గానరెకమ్మదమ్ములార
మీవాసనల మీఱు మేని తావులపూవుఁగొమ్మఁ గానరె చందనమ్ములార
మావులార చూకారంపు మోవులార, దాఁకలారయనంటి క్రొంమోఁకలార
మల్లులార చలన్నాగవల్లులార, చూడరేమిరు తలిరాకుబోఁడినిందు. ౨౦

సుగంధి. జాలమేలబాలఁ జూపుసాల మారసాలమా
తాళఁజాల మాలతీలతావృతాళిజాలమా
వాలుఁగంటి జాడఁజూడ వావనీతమాలమా
నీలవేణి గానవోటు నీవునేడు తాళమా. ౨౧

వ. అని యగ్గలంబగు విరహావేశంబులఁ గందర్ప చంద్రమందానిల కలకంఠాదులం
గురించి. ౨౨

సీ. కురులచేనీవింటి గుణభంగమొనరించు భామినిఁ గానవా పంచబాణ
మోముదామరనునీ గోముడీలఁగఁజేయు సుందరిగానవా చందమామ
వాలుకన్గవను నీవాహనంబును గేరు సుదవతిఁ గానవా మలయపవన
గళరవంబుననిన్నుఁ గాదనివాదంచు కోమలిఁ గానవా కోకిలంబ
పగగలుగుదాని నే చంగిబలము లేక, మీరలిండఱు గమిగూడి కెరుకొనుచు
వనములోఁ దద్వియోగార్తివనరుచున్న, నన్నుఁ దబ్బిబ్బుగావింప న్యాయమగునె. ౨౩

వ. అని యిట్లు వనవనావస్థలం గగిలి పొగలుచుండి యెట్టకేలకుఁ దెలివిదెచ్చుకొని. ౨౪

ఉ. అద్దిర యొద్దఁ జేరి వినయమ్మున సేవ యొనర్చుచుండిన
ముద్దులగుమ్మ సౌరుగని మోహము వుట్టి కరంబు పట్టినన్
గద్దరిమాటలాడి చనఁగా వని బల్మి రమింపనైతి నా
బుద్ధికి మోసమయ్యెఁ జెలి బూమెలు పన్నినఁ గేమి సేయుదున్. ౨౫

క. అనిమిషలీలఁ గాంచుచుఁ, దనువెల్లను వెల్లవోవఁ దహతహ గుడన్
గనవయ్యె నరుం డపుడ, ర్జుననామము సార్థకముగ సొంపరియుండెన్. ౨౬

క. అతీయ తెలిసి రుక్మిణి, ప్రీతిన్ భోజనము సంగఁ బ్రియమున నదితాఁ
జేతన్ ముట్టఁడు మెసఁగఁడు, నాతిసుధారసము గ్రోలనాటిన ప్రేమన్. ౨౭

క. ఇదిరాతిరి యిదిపవలు మ, రిది సంజయటంచు నెఱుఁగఁ డింద్రసుతుండా
సుదతీమణి సొగసంతయు, మదిఁ దలపోయుచు విరాళి నలుగుచునుండెన్. ౨౮

క. అటనంతిపురి సుభద్రా, కుటిలాలక నరుని చెలువు కూరిమితో హృ
త్పుటమున మరిమరి నెన్నుచుఁ, బటుతరసుమ చాపతాప పరవశయగుచున్. ౨౯

క. సొమ్ముసెలుఁ జెలియఁ గాసెలుఁ, బిమ్మటఁ గొనుఁ జెలులఁ గసరు నెగ్గులవగచున్
హుమ్మనుచు వెచ్చనూర్చున్; నెమ్మోమొక్కింతవంచి నేలఁ గ్రుసేయుంచున్. ౩౦

సీ. పరపుపైనిడ్డ సంపంగి పూవులుచూచి కనలు నిప్పుకలంచుఁ గళవళించుఁ
జనుఁదోయి నలఁదిన చందనంబీక్షించి క్రొత్త సున్నమటంచుఁ దత్తరించు
నురమున నునిచిన విరిసరంబులఁ గాంచి పెనుబాములనుచు భీతినఁ జలించుఁ
బయిపయిఁ జల్లిన పన్నీరు గనుఁగొని వేఁడి నూనియటంచు వెతఁ గృశించుఁ
గడిమి యెడరం గనుడుగక కుడియెడముల, బడిబడిఁ గడింది గావడి వడినిఁ బరపు
చెలువవిలుకాని విరితూఁపు సెకలఁ గ్రాఁగి, వేఁగిలోలోఁగ పొగియుత్తి గబోఁడి. ౩౧

వ. మరియుం దనలోన. ౩౨

ఉ. అక్కట నేను గోరిన సుభాంగుఁడు నన్ను వరింప వేడుకన్
మక్కువ పిక్కటిల్ల యతిమాడ్కిని దగ్గర వచ్చి వేఁడినన్
జిక్కనిగుబ్బచన్ను లెదఁ జేర్చి కవుంగిటఁ గూర్పకూరకే
చిక్కులఁ బెట్టివచ్చితిని సీ యతఁ డెంత విరాళిఁ గూలెనో. ౩౩

గీ. కటకటా నేఁడు పచ్చవిల్తునిఁ గేరు, నామనోహరమూర్తి నన్నరుని నొంటి
మహవనంబున మరుచెఱ నుండఁ జేసి, యేఁకి కురించి వచ్చితిఁ బేలనగుచు. ౩౪

ఉ. ఎంతమనోభవార్తిఁ గృశియించెనొ యెంతమరంద చింతచే
స్వాంతమునం గలంగెనొ భయంపడి యొవ్వరి నెంత వేఁడెనో

యింతగ యాళియంచు నను నెగ్గులు వల్కెనో యాతఁడ బ్రహ్మై
యింతయు నామదిం దిగులు హెచ్చెనహా యిఁక నేమి సేయుదున్. ౩౫

క. ఎప్పటివలె సేవకుఁబోఁ, దప్పఁగఁబోకున్న నిలువఁదరమె పయిఁ
గప్పిళ్ళాలఁది గప్పెదు, నప్పచ్చని వింటిజోదు నలుగుల సెకలన్. ౩౬

చ. కలుగునొకల్లదోపెనఁగి కాదనివచ్చిన తప్పుదీరఁగ్రొం
దలుకు కడాని జీనిపనిసంతపు మంచముమీఁద వేడుకం
గలుగుచు నామిటారి చనుగుబ్బలు గొద్దిఁగవుంగిలించియా
చెలువుని కాత్మఁబండువుగఁ జేయు నదృష్టము నాకు దైవమా. ౩౭

క. ఆవగయాజిగిబిగిమే, నావాలుంగన్నుఁదోయి యానవ్వు మొగం
బావేళ నామనంబున, దావలమై మరపురాదు తాళం దరమే. ౩౮

క. అక్కట యక్కురువీరుని, యక్కజ జిగిచన్నుఁదోయి యసరంటంగా
నొక్కుచు రతిఁ గెనఁగనిదా, చక్కదనంబేలయుదుట జవ్వనమేలా. ౩౯

చ. ఎటువలె నోర్చియుందు నిఁక నెవ్వరి నే బతిమాలుకొందు హా
త్పుటముసఁ జిందుమారఁ పరిపూర్ణ శరానల మెట్లు డిందును
త్కటవిరహోప తాపమడఁగన్మతి యెయ్యది మందు దైవమా
కటకట వానిపొందు వెసఁగల్గునొ కలదో యెట్లు కుందుదున్. ౪౦

వ. అని మఱియు నమ్ముద్దుగుమ్మం గమ్మవిల్కాఁడు వాడిమీఱంగ రాళమురాళ కీరశారీమ
ధుప్రతాన్య భృతకేకి ప్రముఖానేకానీకినుల నంచెంచలంగాపు వెట్టి, యుద్దండ
మండిత ప్రచండపుండ్రేక్షు కోదండ దండంబఖండ పరాక్రమంబున నెక్కువెట్టి,
బిట్టు మొఱయించి, చేకొద్దిగ నుద్ద విడిం జిమ్ము క్రొమ్మెఱుంగు కమ్మదమ్మిపూటమ్ము మొ
త్తములు ఱొమ్మున నొక్కుమ్మడింగాడి పారినసొమ్మసిలి, వేలుదప్పిన జాళువాబొమ్మ
పొలికననల్పమణిగణ ప్రభాభాసమాన హంసతూలికా తల్పంబున మేను జేర్చి కొంత
సేపునకుం దెప్పిరి. ౪౧

క. హరహర! పరిచరయుతుఁడై, మరుఁడేఁచఁగఁ జొచ్చె నాసమాని వనికిఁ జె
చ్చెర నరిగి నరుఁ గురిచి మెయి, దొరఁగినఁ బరలోకసుఖము దొరకు నటంచున్. ౪౨

క. చకచకలీన్మణిమంచపు, సెకలపయిం జేతు పూనిసీత్కృతులడరన్
మెకమెక యించుక జుమ్మనఁ, దెకతెక నొడలు డుక లేచి దీనతమీఱన్. ౪౩

క. అడుగులు దడఁబడ బిగిగా, న్నడగడవడకన్ నిడూర్పు గాడ్పులు వొదలన్
గడితపువల్వ చెఱఁగుముసుం, గిడి సాహసమూఁతగాఁ గనేఁగెన్ వనికిన్. ౪౪

వ. అట్లేగి. ౪౫

